# "శ్రీవాణి" కి అవార్డు

ఆంధ్రప్రదేశ్ చిన్న పత్రికల సంఘం నిర్వహించిన పోటీలలో 1986 సంవత్సరానికి "శ్రీవాణి" కి విశిష్ట అవార్డు లభించింది. ఈ సందర్భమున ది 11-7-87 న హైదరాబాద్‌లో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో జరిగిన అవార్డు ప్రదాన మహోత్సవ సదస్సుకు ఆంధ్రప్రభ మాజీ సంపాదకులు, "కోస్తావాణి" సంపాదకులు శ్రీ కూచిమంచి వెంకటసుబ్రహ్మణ్యం అధ్యక్షత వహించారు. ఈ సదస్సులో ముఖ్య అతిధిగా పాల్గొనిన హైకోర్టు న్యాయమూర్తి శ్రీ ఐ పాండురంగారావు మాట్లాడుతూ సమాజంలో చిన్నపత్రికల పాత్ర గణనీయమైనదని వాటిని ప్రోత్సహించవలసిన బాధ్యత ప్రభుత్వంపై గూడ వున్నదని పేర్కొన్నారు. ఈ సదస్సులో సర్వశ్రీ పోతుకూచి సాంబశివరావు, పీలా రామకృష్ణ, మన్నవ గిరిధరరావు, మండలి బుద్ధప్రసాద్ ప్రభృతులు ప్రసంగించారు. "శ్రీవాణి" మేనేజర్ శ్రీ కె. చంద్రశేఖర్ అవార్డును స్వీకరించారు. గుంటూరు వాణి, నవీన, గాంధీక్షేత్రం, భారతీయ మార్గములకు అవార్డులు లభించాయి.



అవార్డును బహూకరిస్తున్న శ్రీ కె. వి. సుబ్రహ్మణ్యం
స్వీకరిస్తున్న శ్రీ కె చంద్రశేఖర్ - ప్రక్కన
శ్రీ పోతుకూచి సాంబశివరావు

విశిష్ట అవార్డును 'శ్రీవాణి'కి బహూకరించిన ఆంధ్రప్రదేశ్ చిన్న పత్రికల సంఘ అధ్యక్షులు శ్రీ పోతుకూచి సాంబశివరావుగారికి కృతజ్ఞతలు. విశిష్ట అవార్డును పొందే అర్హతను సంపాదించిపెట్టిన రచయితలకు, రచయిత్రులకు అభినందనలు. —సం

## ఆంధ్రప్రదేశ్ తెలుగు చిన్నపత్రికల సంఘం (రిజిష్టర్డు)

### హైదరాబాదు

—o—

ఆంధ్రప్రదేశ్ తెలుగు చిన్నపత్రికల సంఘం ఆధ్వర్యంలో 1986 వ సంవత్సరానికి ఉత్తమ మాస పత్రికగా "శ్రీవాణి" పత్రికా సంపాదకులు శ్రీ కె. కృష్ణమోహన్ రావు గారికి విశిష్ట అవార్డు యివ్వడమైనది.

సజ్జన్ లాల్
దక్షిణాభారత సైకిల్ మాన్యుఫాక్చరింగ్ కంపెని, సికింద్రాబాదు
అవార్డు దాత

పోతుకూచి సాంబశివరావు
అధ్యక్షులు

ఆగస్టు - 1987
సంపుటి : 3
సంచిక : 8

సాంస్కృతిక మాసపత్రిక
సంపాదకుడు-కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-51 రామానాయుడుపేట
మచిలీపట్నం-521 001
ఫోన్ : 2818

విడి ప్రతి : రు. 3-00
సంవత్సర చందా : రు. 36-00
2 సం॥ల చందా : రు. 66-00
4 సం॥ల చందా : రు. 116-00
జీవిత సభ్యత్వం : రు. 500-00

Cheques & Drafts should be drawn in favour of SREEVANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SPANDANA PRINTERS
MACHILIPATNAM

విషయ సూచిక



ముఖచిత్రం :
జాతీయ పతాక నిర్మాత శ్రీ పింగళి వెంకయ్య

# జాతీయ పతాక నిర్మాత

# శ్రీ పింగళి వెంకయ్యగారు

మన జాతి పిత మహాత్మాగాంధీని దాదాపు మరచి పోయిన మన భారతదేశం, మన జాతీయ పతాక నిర్మాత అయిన శ్రీ పింగళి వెంకయ్యగారిని మరచిపోయిందంటే మనం ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు. స్వతంత్ర ప్రతిపత్తి గలిగిన ప్రతి దేశానికీ ఒక పతాక ఉన్న సంగతి మనకు తెలిసినదే. అలాగే మన దేశానికి కూడా ఒక జాతీయ పతాక కావాలని మనకు స్వరాజ్యం రావడానికి పూర్వమే - చాలాకాలం కిందట, అంటే 1907 లో - ఒక మహామేధావికి, ఒక అకలంక దేశభక్తుడికి కోరిక కలిగింది. ఆ మహనీయుడు, ఆ బహుముఖ ప్రజ్ఞానిధి శ్రీ పింగళి వెంకయ్యగారు.

## డాక్టర్ భావరాజు నరసింహారావు

## జననం - విద్యార్జన

పింగళి వెంకయ్యగారు ఆగస్టు 2, 1878 తేదీని కృష్ణాజిల్లా భట్లపెనుమర్రు గ్రామంలో జన్మించారు, మాతామహుల యింట. వీరి తండ్రి హనుమంతరావుగారు దివి తాలూకా యార్లగడ్డ గ్రామ కరణం. వెంకయ్యగారి మాతామహులు అడివి వేంకటాచలంగారు చల్లపల్లి సంస్థానంలో తాణేదారు. ఆయనకు పెదకళ్ళేపల్లి బదిలీ అవటంచేత వెంకయ్యగారు ఆ ఊళ్ళో ప్రాథమిక విద్య పూ రిచేసుకున్నారు. లోయర్ సెకండరీ పరీక్ష 1890లో పాస్ అయినారు. తరువాత బందరు హిందూ హైస్కూల్‌లో హైస్కూలు చదువు పూర్తిచేసుకున్నారు.

తరువాత బొంబాయికి వెళ్ళి, తన 19-వ ఏట యుద్ధ సైనికుడిగా చేరి, ఆఫ్రికాకు వెళ్ళారు. అక్కడ జరుగుతున్న బోయరు యుద్ధంలో పాల్గొన్నారు. అక్కడినుంచి తిరిగి వస్తూ అరేబియా, ఆఫ్ఘనిస్థానాలు కూడా చూసి వచ్చారు.

మదరాసులో ప్లేగు ఇన్‌స్పెక్టరు ట్రయినింగులో ప్రప్రథముడుగా ఉత్తీర్ణుడై, బళ్ళారిలో ప్లేగు ఇన్‌స్పెక్టరుగా కొంత కాలం పనిచేశారు. ఆయనకు చదువుమీద ఆసక్తి ఎక్కువగా ఉండటంచేత ఉద్యోగం మాని, సిలోను దేశానికి వెళ్ళారు. అక్కడ కొలంబో నగరంలోని సిటీ కాలేజిలో పొలిటికల్ ఎకనామిక్సు అభిమాన విషయంగా తీసుకుని కేంబ్రిడ్జి సీనియర్ పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు.

ఇంటికి తిరిగి వచ్చి మదరాసు - బెంగుళూరు రైలు మార్గంలో గార్డుగా 1906 లో చేరి కొంతకాలం పని చేశారు. ఆయన విద్యాపిపాస ఇంకా తీరలేదు. ఉద్యోగానికి రాజీనామా చేసి లాహోరు లోని డి.ఎ.వి. కాలేజీలో చేరారు. అక్కడ సంస్కృతం, ఉర్దూ, జపాను భాషలు చదివి ఆ భాషలలో మంచి పాండిత్యం సంపాయించారు. అనర్గళంగా ఆ భాషల్లో ఉపన్యసించేవారు.

## వ్యవసాయశాస్త్ర పరిశోధన

శ్రీ దాదాభాయి నౌరోజి అధ్యక్షతను కలకత్తాలో (1908) జరిగిన కాంగ్రెసు మహాసభలకు వెళ్ళి, విషయ నిర్ణాయక సంఘ సభ్యులుగా ఎన్నికయ్యారు. తదాది కాంగ్రెసు మహాసభలకు తప్పకుండా వెడుతూ ప్రముఖ స్థానం వహించారు.

కలకత్తా మహాసభలలో మునగాల రాజా శ్రీ రాజా నాయని రంగారావు బహద్దరుగారి పరిచయ భాగ్యం కలిగింది. వెంకయ్యగారి దేశభక్తినీ, పట్టుదలనూ, కార్యదక్షతనూ గమనించిన రాజాగారు, వెంకయ్యగారిని

మునగాల ఆహ్వానించి తీసుకువచ్చారు. అప్పటికే వెంకయ్యగారు వ్యవసాయ శాస్త్రంలో బాగా పరిశోధనలు చేసి ఉన్నారు. రాజాగారి కోరికను అనుసరించి వెంకయ్యగారు మునగాలలో వ్యవసాయ పరిశోధనశాలను ప్రారంభించి ఎంతో కృషి చేశారు. అమెరికానుంచి కంబోడియా ప్రత్తివిత్తనాలను తెప్పించి, ప్రత్తిని పండించారు. మన దేశంలో సన్నని నూలును తయారుచేయడానికి అవసరమైన కంబోడియా ప్రత్తిని ప్రప్రథమంగా పండించిన ఘనత వెంకయ్యగారికి దక్కుతుంది. వెంకయ్యగారు 1907 నుంచి 1910 వరకు మునగాలలో ఉన్నారు. ఆ కాలంలోనే "వ్యవసాయ శాస్త్రము" అనే గ్రంథాన్ని వ్రాశారు, ఇంగ్లీషులో.

వెంకయ్యగారి వ్యవసాయ పరిశోధనలనూ, వారి గ్రంథాన్ని పరిశీలించి లండన్‌లోని రాయల్ అగ్రికల్చరల్ సొసైటీవారు వెంకయ్యగారికి సొసైటీ సభ్యత్వం యిచ్చి గౌరవించారు. సువర్ణ పతకాలనూ, సర్టిఫికెట్లనూ బహూకరించారు.

అదే కాలంలో (1907) వెంకయ్యగారు జాతీయపతాక ఆవశ్యకతను గుర్తించి కృషి ప్రారంభించారు.

## ఆంధ్ర జాతీయ కళాశాల అధ్యాపకత్వం

బందరు ఆంధ్ర జాతీయ కళాశాలలో వెంకయ్యగారు 1911 నుంచి 1919 వరకు అధ్యాపకులుగా ఉన్నారు. వ్యవసాయశాస్త్రం, హిందూదేశ చరిత్ర, గుర్రపు స్వారీ, శరీర వ్యాయామం, మిలిటరీ శిక్షణ మొదలైన విషయాలను బోధించేవారు. విద్యార్థులకు సైనిక శిక్షణ యిస్తూ స్వాతంత్ర్యయోధులనుగా తయారుచేశారు. ఈనాడు ప్రభుత్వం తలపెట్టిన ఎన్. సి సి. శిక్షణ ఉద్యమాన్ని వెంకయ్యగారు 75 ఏళ్ళ క్రితం అమలుపరచారన్న విషయం మనం ముఖ్యంగా గమనించాలి. ఆ రోజుల్లోనే వెంకయ్యగారు చైనా రిపబ్లిక్ ప్రథమ అధ్యక్షుడు "సన్ యట్ సెన్ జీవిత చరిత్ర"ను వ్రాశారు. లండన్‌లోని ప్రఖ్యాత పత్రిక "టైమ్స్" - "సన్‌యట్ సెన్ జీవిత చరిత్రను ఒక భారతీయుడు ప్రప్రథమంగా రచించటం చాలా హర్షణీయం" అని - ఎంతో మెచ్చుకుంటూ వ్రాసింది.

## జాతీయపతాకను గురించిన పుస్తకం

జాతీయ కళాశాలలో ఉంటున్న కాలంలోనే (1916) వెంకయ్యగారు "భారతదేశానికి ఒక జాతీయపతాక" అనే పుస్తకం వ్రాశారు. దానికి ఆనాటి వైస్రాయి కార్యవర్గ సభ్యుడు సర్ బి.ఎన్.శర్మ తొలిపలుకు వ్రాశారు. "కృష్ణా పత్రిక" ఆ పుస్తకాన్ని గురించి ఎంతో ప్రశంసిస్తూ సంపాదకీయాన్ని ప్రచురించింది. ఈ గ్రంథ రచనతో వెంకయ్యగారికి స్థిర ప్రతిష్ఠ లభించింది.

అనిబిసెంటు ప్రారంభించిన హోంరూలు ఉద్యమంలో కూడా వెంకయ్యగారు పాల్గొన్నారు. జాతీయ పతాక ఆవశ్యకతను బాగా ప్రచారం చేశారు.

## త్రివర్ణ పతాక నిర్మాణం

బెజవాడ (ఇప్పటి విజయవాడ)లో 1921 లో అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశం జరిగింది. గాంధీ మహాత్ముడు వెంకయ్యగారు జాతీయ పతాక విషయంలో చేస్తున్న కృషిని అప్పటికే బాగా ఎరిగి ఉన్నారు. అంచేత బాపూజీ వెంకయ్యగారిని ఆహ్వానించి, జాతీయ పతాక నమూనాను తయారుచేసి ఇమ్మని కోరారు.

వెంకయ్యగారు ఆ నమూనాను మూడు రంగులలో మూడు గంటల్లో తయారుచేసి గాంధీజీకి అందచేశారు. గాంధీమహాత్ముడు ఎంతో సంతోషించారు. తన "యంగ్ ఇండియా" పత్రిక (13-4-1921)లో "మన పతాకము" అనే శీర్షికతో యిలా వ్రాశారు :

"ఏకైక జాతీయపతాకం కోసం సర్వస్వం త్యాగం చేయాలన్న విషయం మనం విస్మరించకుండా ఉండటం ఎంతో అవసరం. మచిలీపట్నం ఆంధ్ర జాతీయ కళాశాల అధ్యాపకులు శ్రీ పింగళి వెంకయ్యగారు ఇతర దేశ పతాకాలను వర్ణిస్తూ, భారత జాతీయ పతాకమునకు నమూనాలను పురమాయిస్తూ లోగడ ఒక పుస్తకాన్ని

( తరువాయి 42వ పేజీలో )

శ్లో॥ ధనాని భూమౌ, పశవశ్చ గోష్ఠే
భార్యా గృహద్వారి, జనాః
దేహశ్చితాయాం, పరలోకమార్గే
ధర్మానుగో గచ్ఛతి జీవ ఏకః ॥

లోకంలో కనబడేదంతా శాశ్వతమనీ, సుఖమనుభవించాలనీ ప్రతి జీవి భావించటం చాలా సాధారణ విషయం. అందుచేతనే ధన కనక వస్తు వాహనాది సంపదను సంపాదించుకోవటంలో ఎంతో ఆరాట పడుతాడు. అలాంటి ఆరాటంలో ఎన్నో చేయరాని పనులు చేస్తాడు. అంతేగాని నిజానికి యివేవీ పోయేరోజున తన వెంట రావనీ ఒక్క ధర్మమే తనకు సద్గతిని కలిగించేందుకు ముందుండి తీసుకొని వెళుతుందనీ గ్రహించడు.

## అమృతవాణి

భూషణ్

బ్రతికి వున్నన్నాళ్లూ మంచి చెడులు చూడకుండా ధనం మిక్కుటంగా సంపాదిస్తాడు మనిషి. దాన్ని రక్షించు కోటానికి ఎంతో సతమతమయిపోతాడు డబ్బున్న దగ్గర్నుంచీ యితర సంపదలు పెంచుకోటానికి ప్రయత్ని స్తాడు. పాడి సమృద్ధిగా వుండటానికి పశువుల్ని కొంటాడు. వాటికి చక్కని గొడ్లపాకలు వేయిసాడు. ఆ పశువులకు గడ్డీ, గాదం నిలవచేస్తాడు. బాగానేవుంది. పాడి పంటలనుభవిస్తూ భార్యాపుత్రులతో సుఖ జీవనం చేస్తున్నానని భావన చేస్తుంటాడు.

నిజమాలోచిస్తే యీ మనిషి మరణించిన తర్వాత పరలోక ప్రయాణానికి యివి ఏవీ వుపయోగపడవు. ఇంత కష్టపడి సంపాదించిన సంపద పోయేనాడు వెంట రాదు. దాచింది దాచినట్లే వుండిపోతుంది. పూర్వం ధనం భూమిలో దాచిపెట్టేవాళ్ళు. అది అలాగే నశించిపోవటమో మరొకరికి దక్కటమో తప్ప చనిపోయినవాడివెంట రాదు. ఆవులు మొదలయిన పశువులు తాను బ్రతికి వున్నన్నాళ్లూ చక్కగా పాలు వెన్న నెయ్యి యిచ్చాయి కాని యిప్పుడు మరణించిన తర్వాత ఆ పశువులు తన వెంట రాకుండా గొడ్లచావిట్లోనే వుండిపోతున్నాయి.

జీవితకాలమంతా ఎంతో ప్రేమించిన అగ్నిసాక్షిగా చేసుకొన్న భార్య భర్త పోయినందుకు బాధపడి విలపి స్తుందే తప్ప భర్తతో పరలోకం వెళ్ళదు. పైగా ఒక రోజు శవాన్ని నిలవ వుంచితే తీసికెళ్ళమని తొందర పెడుతుంది. అందుకే " భార్యాబిభ్యతి తస్మిన్‌కాయే " అని శంకరులన్నారు. శవాన్ని తీసికెళుతుంటే భార్య శ్మశానందాకా కూడా తోడు వెళ్ళదు. ఇంటి గుమ్మం దగ్గరనే ఆగిపోతుంది.

ఇక హితులు బంధువులు వున్నారంటే వాళ్ళందరూ ఎంత ప్రేమ చూపించినా శ్మశానం వరకు వెళ్లి దహన మయ్యేదాక వుండి యింటికి తిరిగి వస్తున్నారు. ప్రాణం వున్నప్పుడు శరీరాన్ని చక్కగా పోషించుకొన్నాడు మనిషి. ప్రాణం కాస్తా పోయిన తర్వాత ఆ దేహం చితిలో కాలి పోతుంది తప్ప తన వెంట రావటం లేదు. ఇంతకూ జీవుడు తన వెంట ఏమీ తోడు తీసికొని వెళ్ళలేకపోతు న్నాడు. ఏకాకిగా పరలోక మార్గంలో ప్రయాణం చేస్తున్నాడు. వీడి గతి యింతేనా ! అంటే కాదు.

మనిషి తన జీవితకాలంలో ఏ ధర్మాన్ని ఆచరించాడో ఆ ధర్మం ఒక్కటే ప్రాణప్రయాణ సమయంలో జీవుని ముందు నడుస్తుంది. అందుచేత ప్రతి మానవుడు ధర్మాన్ని ఆచరిస్తూ ప్రవర్తించటం ద్వారా సద్గతినందుకో గలుగుతాడు.

ధర్మో రక్షతి రక్షితః స్వధర్మేనిధనం శ్రేయః *



# జ్ఞాన మోక్ష ప్రదాయిని
# ప్రశాంతి నిలయం

సత్యం శివం సుందరం
పర్తీశ్వరుని మందిరం
దివ్యప్రేమ ధామం
అది ప్రశాంతి నిలయం ...

సాయినాథుని ఆలయం
సకల విద్యలకు నిలయం
విశ్వ విజ్ఞాన కేంద్రం
అది ప్రశాంతి నిలయం ...

సత్యసాయి నిలయం
విశ్వానికే ఆలయం
భక్తులకు ధ్యానకేంద్రం
అది ప్రశాంతి నిలయం ...

ప్రేమసాయి మందిరం
శాంతి ప్రేమలకు నిలయం
విశ్వశాంతికి మూలం
అది ప్రశాంతి నిలయం ...

సాయీశ్వరుని మందిరం
భక్తులకు దేవాలయం
బాలురకు విద్యాలయం
అది ప్రశాంతి నిలయం ...

అది ప్రశాంతి నిలయం. సర్వ మానవాళికి జ్ఞాన భిక్షను ప్రసాదించు జ్ఞాన కేంద్రం. మానసిక శాంతిని ప్రసాదించు ధ్యానకేంద్రం. శాంతి ప్రేమలను పెంపొందించు దివ్య ప్రేమ ధామం. జ్ఞాన మోక్ష ప్రదాయిని "ప్రశాంతి నిలయం". భిన్న భాషలు విభిన్న దేశాలకు చెందిన వారెందరో అక్కడికి వచ్చి నెలలతరబడి వుండి మానసిక శాంతిని పొంది, బాబా ప్రేమామృతములను ఆస్వాదించి, ఆత్మ విశ్వాసంతో, ఆనందంతో బాబా సందేశాలను మననం చేసుకుంటూ తమ గృహాలకు తరలి పోతుంటారు. బాబా ప్రతిపాదించిన సేవా కార్యక్రమములలో శక్తి వంచన లేకుండా పాల్గొంటూ ఆనంద అనుభూతులను పొందుతుంటారు. ప్రతి నిత్యం వచ్చే వారికి వెళ్ళేవారికి లెఖ్ఖే వుండదు. స్వామిని ఎన్ని

కొమ్మగిరి కృష్ణమోహనరావు

పర్యాయములు చూచినా తృప్తి వుండదు. మరల ఒక పర్యాయం ఆ సుందర మనోహర రూపాన్ని కళ్లారా చూడాలని తాపత్రయ పడుతునే ఉంటారు. ఒక్క పర్యాయం ప్రశాంతి నిలయం చూచి, బాబాను సందర్శించి వెళ్ళాలని వచ్చినవారు రోజులతరబడి అక్కడనే వుండి పోతారు. ఇండ్లకు వెళ్ళిన తరువాత మరల ఎప్పుడు ప్రశాంతినిలయం వెళ్దామా ! అని ఆతురత జెందుతూ వుంటారు మరి కొందరు అయితే అక్కడనే స్థిర నివాసం ఏర్పరుచుకొని; ఉదయం, సాయంత్రం బాబాను సందర్శించుకుంటూ; ఆనంద అనుభూతుల పొందుతూ జీవనయాత్ర కొనసాగిస్తూ వుంటారు. ఒక్కమాటలో చెప్పాలంటే యావత్ ప్రపంచాన్ని ఆకర్షిస్తున్న ఏకైక కేంద్రం "ప్రశాంతి నిలయం". ఏకైక దైవము "శ్రీ సత్యసాయి." సహజంగా ప్రతివారు తమ జీవితంలో ఒక పర్యాయం పవిత్రమైన పుణ్య క్షేత్రాలను

సందర్శించి తృప్తి పడాలని భావిస్తుంటారు. మరింత అవకాశం ఉన్నవారు కాశీ, రామేశ్వరాలను మూడు తడవ లయినా చూడాలని కోరుకుంటారు. జీవితంలో తిరుమల దివ్య క్షేత్రమును ప్రతి సంవత్సరం సందర్శించేవారు కూడా వున్నారు. అది వారి వారి భక్తి ప్రపత్తులను బట్టి, ఆర్థిక స్థితి గతులపై ఆధారపడి వుంటుంది. అయితే ప్రశాంతి నిలయమును మాత్రం, ఒకే సంవత్సరంలో వచ్చే అన్ని పరవడిదినాలకు వెళ్ళి సందర్శించే భక్తులు కోకొల్లలు. అదే అక్కడి ప్రత్యేకత.

## బాబా అనుగ్రహం

స్వామి దర్శనం అందరికీ ప్రతినిత్యం లభ్యమవుతుంది. బాబా విభూతి ప్రసాదం లభ్యం కావటం కష్టం. స్వామి పాద నమస్కారం లభించటం యింకా కష్టం. స్వామితో ప్రత్యేకమైన ఇంటర్వ్యూ పొందటం అతి కష్టం. అది వారి వారి పూర్వజన్మ సుకృతం మీద ఆధారపడి వుంటుంది. బాబా అనుగ్రహానికి పాత్రులయ్యేవారిలో కోటీశ్వరులూ వుంటారు, కడు పేదవారూ వుంటారు. ఉన్నత చదువుల నభ్యసించినవారూ వుంటారు; నిరక్షరాస్యులూ వుంటారు. బాబాగారి దృష్టిలో అందరూ ఒక్కటే. ఎంతటివారైనా నేలమీద కూర్చొని గంటలతరబడి నిరీక్షించవలసినదే. రోజులు, నెలలతరబడి నిరీక్షించిన తరువాత కూడా బాబా అనుగ్రహానికి పాత్రులు కాకపోవచ్చు. విభూతి ప్రసాదం లభించకపోయినా, పాద నమస్కారం దొరకకపోయినా, ప్రత్యేకమైన ఇంటర్వ్యూ పొందలేకపోయినా, ఎవరిలోను, ఎక్కడా నిరుత్సాహ ఛాయలు ఏమాత్రం కనిపించవు. ఇంకా మనం బాబా అనుగ్రహాన్ని పొందే అర్హతను సంపాదించుకోలేక పోయామని భావించి, దర్శనభాగ్యమైనందుకు సంతృప్తి చెంది తిరిగి వెళ్ళిపోతుంటారు.

## బాబా దివ్యశక్తి

ఒక పర్యాయం ఒక భక్తుడు "బాబా! మీరు దేని ఆధారముతో భక్తులను అనుగ్రహింపుచున్నారు ?" అని అడుగుతాడు. అప్పుడు బాబా "ఏ వ్యక్తి అయినా నన్ను పూర్తిగా శరణుజొచ్చినప్పుడు, ఆ స్థితిలో అతనికది హెచ్చుగా ఉపకరించునని నేను భావించినప్పుడు, వానిపై నేననుగ్రహము చూపించెదను. వాల్టర్ కోవన్ మద్రాసులో ఉన్నప్పుడు మూడుసార్లు గుండె పోటు ప్రాణాంతకముగా వచ్చినది. ఆ మూడుసార్లు కూడా నేనాతనికి ప్రాణదానము గావించినాను. శ్రీమతి కోవన్‌కు తన భర్త మృతకళేబరమును తమ దేశము తీసుకొనుపోవుసట్టి బాధను, ఇబ్బందిని కలిగించుట ఇష్టములేక, రక్షించదలిచాను. అదికాక అమెరికాఖండవాసులు, ప్రాచ్య సందేశమును - నా సందేశమును ఎంతో ఆసక్తితో, భక్తి ప్రపత్తులతో యోచించ ప్రయత్నించుచున్నారు." అని చెప్పారు. శ్రీకృష్ణభగవానుడు కూడా ఇదే విధమైన సందేశాన్ని ప్రపంచానికందించాడు. "అనన్యాశ్చిన్తయంతోమాం, యేజనాః పర్యు పాసతే ; తేషాం నిత్యాభియుక్తానాం, యోగక్షేమం వహామ్యహమ్" "ఎవరు ఇతర భావములు లేనివారై నన్ను గూర్చి చింతించుచూ ఎడతెగక ధ్యానించుచున్నారో ఎల్లప్పుడు, నాయందే నిష్ఠగలవారియొక్క యోగక్షేమములను నేను వహించుచున్నాను." అని చెప్పిన మాటలు, బాబాగారి మాటలతో సరిపోతాయి. అలనాడు ఆ మహత్తరమైన దివ్యశక్తి శ్రీకృష్ణపరమాత్మలో ఉండటం వలననే దుష్టులను శిక్షించగలిగాడు; శిష్టులను రక్షించగలిగాడు. తనను నమ్ముకున్నవారి యోగక్షేమములను స్వీకరించగలిగాడు. ఈనాడు ఈ కలియుగంలో మానవ రూపంలో మనకు కనిపిస్తున్న శ్రీ సత్యసాయి మానవమాత్రుడే యని భావించడం వట్టి అవివేకమే అవుతుంది. అది ఒక దివ్య స్వరూపం. శ్రీకృష్ణునిలాగే బాబాగారు కూడా తన సంకల్పంతో దివ్య లీలను చూపించగలరు. సృష్టించగలరు. వారి లీలలో మహిమాతి మహిమమయిన వారి దివ్య శక్తి మనకు స్ఫురిస్తునే ఉంటుంది. వారిలో పరాత్మ స్వరూప లక్షణాలైన "సత్యం, శివం, సుందరం" ప్రత్యక్ష రూపాన్ని దాల్చాయి. వారు చూపే ప్రేమ, చిందించే

చిరునవ్వు, పలికించే కరుణాదృష్టి - దివ్యత్వాన్ని ప్రదర్శిస్తూనే ఉంటాయి. మన మనస్సులోని బాధలు, కోరికలు, ఆలోచనలు - మనం చెప్పకుండానే, మనము అడుగకుండానే వారు చెప్పివేయగలరు. ఓదార్చి, బుజ్జగించి; అవసరమైన ధైర్యాన్ని ఆత్మవిశ్వాసాన్ని యిచ్చి, ఉత్సాహపరచి, కొండంత బలాన్ని చేకూర్చి, ఆశీర్వదించి భక్తులను పంపిస్తుంటారు. వారు చూపే ప్రేమకు మనం ముగ్ధులమైపోతాం. వారు మనకు ఎంతో సన్నిహితంగా ఉన్నారనే అనుభూతిని కూడా పొందుతాం. వారికి దగ్గరగా ఉన్నప్పుడు వారి వాడి చూపులు మన హృదయాంతరాళంలోనికి చొచ్చుకొని పోతున్నాయా! అనిపిస్తుంది. మన జీవిత రహస్యాలన్నీ వారికి స్పష్టంగా తెలుస్తాయి. వారి దృష్టినుంచి మనం దాచగలిగినది ఏదీ లేదు. మన భూత భవిష్యత్ వర్తమానాలన్నీ ఆయన కళ్ళకు కనబడుతూనే ఉంటాయి. వారి కళ్ళు 'ఎక్స్‌రే కళ్ల' కు మించిన శక్తివంతమైనవి. ఈ సృష్టిలో వారికి కనపడనిది ఏదీ లేదు, తెలియనిది అంతకన్నా లేదు. వారు ఒక పర్యాయం భక్తులకు చెబుతూ "నా దర్శనము వల్ల మీరు పొందు లాభమును ఎన్నటికీ చులకనగా చూడకండి. ఇది మీకు పూర్వ పుణ్యమువలన అబ్బిన వరప్రసాదము. నా దర్శనార్థము దేవలోకములోని దేవతలు కూడా ఆతురతతో వేచి యుందురు. అంతటి మహా దర్శనభాగ్యము మీకు సులభముగా దిన దినము అబ్బుతూ వున్నది. ఇది జన్మాంతర పుణ్య విశేషము. మరువకండి. సరియైన సమయమాసన్నమైనప్పుడు, నా దర్శన భాగ్యమువలన మీకు యిచ్చిన దీవెనలు ఫలించును." అని అంటారు. దీనిని బట్టి ఆలోచిస్తే వారి శక్తికి పరిమితం లేదని, హద్దులు లేవని, అది మహిమాన్వితమైన, అత్యద్భుతమైన, అఖండ శక్తి యని ద్యోతకమవుతుంది. ఆయన సర్వాంతర్యామి. ఆయన దివ్య యుగావతారం.

## నా అనుభవం

మూడు దశాబ్దాలపాటు రాజకీయాలలో దేశదిమ్మరిగా తిరిగిన నేను అనుకోకుండా, బాబా సంకల్ప బలంతో వారి సన్నిధికి 1985 అక్టోబర్ (దసరా) లో చేరగలిగాను. వారి అనుగ్రహానికి ఊహించని రీతిలో పాత్రుడనైనాను. తరువాత (జూలై '86 ; నవంబర్ '85 ; మార్చి '87; జూలై '87 ) నాలుగు పర్యాయాలు వారిని దర్శించాను. ఈ ఐదు తడవలలో ఏడు పర్యాయాలు నాకు ప్రత్యేకమైన ఇంటర్వ్యూలనిచ్చి నన్ను ఆశీర్వదించారు. శివలింగం, ఉంగరం, గడియారం లాంటి వస్తువులను సృష్టించి నాకు యిచ్చారు. బాబాగారి దృష్టిలో 'మిరకిల్స్' కు ప్రాధాన్యత లేదు. ఇవి ప్రజానీకంలో ఆస్తికత్వాన్ని, శ్రద్ధాభక్తులను, విశ్వాసాన్ని పెంపొందించుటాయి మాత్రమే. నాస్తికత్వం ప్రబలిపోతున్న ఈ రోజులలో బాబాగారి మహిమలు లక్షలాదిమందిని నైతిక ఆధ్యాత్మిక మార్గంలోనికి మార్చగలుగుతున్నాయి. బాబాగారిని అర్థం చేసుకొననప్పుడు సహజంగా ప్రతి వ్యక్తి ఆయనను శంకిస్తాడు, విమర్శిస్తాడు. వారి సన్నిధికి చేరిన తరువాత వారిలోని మహిమాన్వితమైన శక్తిని అర్థం చేసుకొని మోకరిల్లుతాడు. వారికి దూరంగా ఉన్నప్పుడు అందరు సాధువులలాగే విభూతి మహిమలను చూపించే బాబాయే అని భావిస్తాం. దరికి చేరినప్పుడు ఆయన ఒక ఆధ్యాత్మిక స్ఫూర్తి ప్రదాత యని, ప్రేమమూర్తి, కరుణామయుడని భావిస్తాం. స్పర్ధలతో, కార్పణ్యాలతో, ఈర్ష్యా ద్వేషాలతో పతనమయి పోతున్న మానవాళిని తమ ప్రేమసందేశం ద్వారా, ప్రేమామృతాన్ని అందించి, వారిలో మానసిక మయిన పరివర్తనను తీసుకొని వచ్చి విశ్వశాంతిని ప్రసాదించటానికి వచ్చిన కలియుగావతారమే శ్రీ సత్య సాయి.

## గురు పూర్ణిమ

గురు పూర్ణిమ మహోత్సవంలో పాల్గొని, బాబాగారి దివ్య సందేశాన్ని ఆస్వాదించాలనే ఆశతో ది. 9-7-87 న నేను, నా శ్రీమతి బందరులో బయలుదేరి 10 వ తేది ఉదయానికి ప్రశాంతి నిలయం చేరాం. 11 వ తేదీన గురు పూర్ణిమ మహోత్సవం కడు వైభవంగా జరిగింది. పూర్ణచంద్ర ఆడిటోరియం చాలక వేలాదిమంది భక్తులు

బయట కూర్చొని దూరశ్రవణ యంత్రాల ద్వారా బాబాగారి సందేశాన్ని విని ఆనందించారు. బాబాగారి ఉపన్యాసం ముందు ప్రశాంతి నిలయంలో చదువు పూర్తి చేసుకొనిన యిద్దరు విద్యార్థులు తమ అనుభవాలను, బాబాగారితో కలిగిన అనుభూతులను చక్కగా వివరించారు. పూర్వ జన్మ సుకృతం వలననే బాబాగారి సన్నిధిలో వుండి చదువుకొనే మహద్భాగ్యం వారికి కలిగినందుకు నేనెంతో ఆనందించాను. ఒకప్పుడు ఇంటర్వ్యూలో బాబాగారు నాతో " Street Dogs "ను తీసుకొని వచ్చి "Street Lights" గా తయారు చేస్తున్నాను " అని చెప్పారు. అది అక్షరాల నిజం. " నేటి బాలురే, రేపటి పౌరులు " అని ఎందరో పెద్దలు ఉపన్యాసాలు మాత్రం యిస్తుంటారు. కాని మంచి పౌరులుగా తీర్చి దిద్దటానికి మాత్రం ఎవరూ ప్రయత్నించటంలేదు. ప్రభుత్వ ప్రయత్నం కూడా అంతంత మాత్రంగానే ఉన్నది. బాబాగారు విద్యారంగంలో చేస్తున్న కృషి ప్రశంసనీయమైనది. వయస్సు వచ్చినవారిని మార్చటం అంత తేలికకాదు. అందుకోన మనే కాబోలు లేత పసిహృదయాల బాధ్యతను బాబాగారు స్వీకరించారు. 1 వ తరగతి నుండి పి. జి. వరకు చదువు ఉచితం. ఫీజులు లేవు. బహుశా ప్రపంచంలో అటువంటి విద్యాసంస్థ వేరొకటి లేదేమో ! భౌతికమైన చదువుతోపాటు నైతిక, ఆధ్యాత్మిక, శీలసంపత్తులను యినుమడింపజేసే విద్యను అక్కడి విద్యార్థులకు బాబాగారే ప్రత్యేకంగా శిక్షణ యివ్వటం విశేషం. సగం సమయాన్ని విద్యార్థుల మీదనే బాబాగారు ప్రతిరోజు వినియోగిస్తారు. వారి యోగక్షేమములను, చదువులను గురించి విచారిస్తుంటారు. మధ్య మధ్యలో చక్కటి కథలను చెబుతూ నవ్విస్తుంటారు. సాయి ప్రేమ కోటి తల్లుల ప్రేమ. వారి ప్రేమకు విద్యార్థులు పరవశులవుతారు. ఇంటిని, తల్లిదండ్రులను మరచిపోయే విధంగా బాబా వారిని లాలిస్తారు, బుజ్జగిస్తారు, ప్రేమిస్తారు. అలనాడు గోపికలకు కృష్ణుని మీద ఎటువంటి ప్రేమ ఉండేదో, ఈనాడు ప్రశాంతినిలయం విద్యార్థులకు బాబాగారంటే అంత ప్రేమ. ఉపన్యాసం ప్రారంభించబోయే ముందు బాబాగారు వేదిక దిగి వచ్చి వరుసలలో కూరున్న భక్తులను తిలకిస్తూ నా వద్దకు వచ్చి " కృష్ణమోహనరావ్ ! ఎప్పుడు వచ్చావ్ ? " అని అడిగారు. ముక్తసరిగా సమాధానం చెప్పాను. దీవించి వెళ్ళిపోయారు. మరల 13 వ తేదీన మరల నన్ను చూచి నవ్వారు. నా వళ్ళు పులకించింది. బాబాగారి దృష్టిలో వున్నందుకు ఆనందం కలిగింది. వారి చూపులు నన్ను ముగ్ధుణ్ణి చేసాయి. అది 14 వ తేది సాయంత్రం 6 గంటల సమయం. సాయి నామ సంకీర్తన భక్తులు తన్మయత్వంతో చేస్తున్న సమయం అది. ప్రతి రోజు గం. 6-25 ఆ ప్రాంతంలో మంగళహారతి స్వీకరించటానికి మందిరంలో సింహాసనం మీద బాబాగారు కూర్చోవటం పరిపాటి. అయితే ఆనాడు బాబా భజన చేస్తున్న భక్తుల ముఖాలను పరికిస్తూ, అడుగులో అడుగు వేసుకుంటూ ప్రశాంత వదనంతో ముందుకు సాగిపోతున్నారు. మంగళహారతి యివ్వకుండా భజన పొడిగించబడింది. స్వామి నరాసరి నా వద్దకు వచ్చి నిల్చొని "కృష్ణమోహనరావ్ ! మీ అబ్బాయి M. B. A. ఎంట్రన్సు వ్రాయలేదా ?" అనిఅడిగారు. "ఈ సంవత్సరం Final year స్వామీ ! వచ్చే సంవత్సరం వ్రాస్తాడు " అని సమాధానం చెప్పాను. "ఎవరో! బందరు విద్యార్థి శ్రీవాణి చదువుతున్నాను. కృష్ణమోహనరావు నాకు బాగా తెలుసు అని అయితే అతనికి సరిపోను మార్కులు రానందున సహాయం చేయలేకపోయాను " అని నాతో చెప్పారు. అందరు భక్తులు సంభ్రమాశ్చర్యాలతో స్వామిని తిలకిస్తూ సంకీర్తన చేస్తున్నారు, నేను అచేతనంగా స్వామిని చూస్తూ మోకాళ్ళమీద నుంచున్నాను. నా కంటి వెంబడి ఆనందబాష్పాలు రాలాయి. ఈ చిన్న విషయం చెప్పడానికోసం స్వామి నా వద్దకు వచ్చినందుకు ఒక విధంగా బాధ పడ్డాను. మరొక విధంగా సంతోషించాను. ఈ సంఘటనను పరికిస్తే ప్రతి చిన్న విషయంలో బాబా ఎంత సునిశితంగా పరిశీలిస్తుంటారో బోధపడుతున్నది. విద్యార్థులు పెట్టుకొనే అప్లికేషన్ ఫారముల దగ్గరనుంచి

లక్షలాదిమంది భక్తుల యోగ క్షేమాలను తెలుసుకొనేందుకు ఎంతటి శ్రద్ధ బాబా తీసుకుంటారో స్పష్టమవుతున్నది. ఇది సామాన్యులకు సాధ్యమయ్యే విషయం కాదు. సర్వాంతర్యామి అయిన ఆ ఒక్క సర్వేశ్వరునికే సాధ్యమవుతుంది.

## స్వామితో ఇంటర్వ్యూ

అది 16 వ తేది. స్వామికి ప్రియమైన వారం గురువారం. సాయంత్రం 5 గం. 5 ని. స్వామి భక్తులను తిలకిస్తూ నా చెంతకు వచ్చారు. "కృష్ణమోహనరావ్! లే!" అన్నారు ఎన్నో రోజులనుంచి ఆ అవకాశం కోసం ఎదురు తెన్నులు చూస్తున్న అదృష్టం నన్ను వరించిందనే ఉత్సాహంతో లేచాను. స్వామికి మనసులోనే కృతజ్ఞతలు తెలియపరచాను. "ఏ పూర్వ పుణ్యమో, ఏనాటి బంధమో" అనుకుంటూ నడిచి మందిరం వరండాలోనికి వెళ్ళి కూర్చున్నాను. బాబాగారు వచ్చారు. ప్రత్యేక ఇంటర్వ్యూ గదిలోనికి పిలిచారు. మాతోపాటు జర్మనీ దేశస్థులు కూడా ఉన్నారు. విభూతి మరియు పంచదారలడ్డు పొడుములు సృష్టించి మాకు యిచ్చారు. "ఆ సంచిలో ఏమి పెట్టావ్? తీయి!" అన్నారు బాబాగారు. నవంబరులో బాబాగారి జన్మదినోత్సవ సందర్భమున శ్రీవాణి ప్రత్యేక సంచికను సర్వాంగ సుందరంగా తీసుకొని రాదలచి, కవరుపేజీ కోసం బాబాగారి ఫోటో కొని ఆ సంచిలో పెట్టాను. దానిని తీసి "బాబా! తమ ఆశీస్సులు పొంది ప్రత్యేక సంచిక పని ప్రారంభించ దలిచాను. తమ పవిత్రమైన సంతకం కోసం ఈ ఫోటో (బాబావి) కొన్నాను. అనుగ్రహించండి!" అన్నాను. ఆ ఫోటో వారు తీసుకొని "With Love – BABA" అని చక్కగా వ్రాసి నాకు యిచ్చారు. ప్రత్యేక సంచికకు బాబాగారి ఆశీస్సులు లభించినందులకు కృతజ్ఞతలు తెలియబరచాను నా శ్రీమతి వైపు చూచి "ఆరోగ్యం బాగానే ఉన్నట్టున్నదే! మొహం కూడా తేటగానే ఉన్నది. అయితే అప్పుడప్పుడు నీమీద కొంచం విసుక్కుంటుంది. నీవు ఇంటి విషయం పట్టించుకోవుగదా? అయితే నీవు యిప్పుడు చేసే కార్యక్రమాలకు సంతోషిస్తునే ఉన్నది. స్వామి కూడా సంతోషిస్తున్నాడు. మీ ఇద్దరిమధ్య వున్న Attachment వలన ఆ విధంగా అనుకోవటం సహజమేగదా!" అన్నారు బాబాగారు. అప్పుడు నేను "Detachment యిప్పించు బాబా!" అన్నాను. "తప్పు! Attachment లో వున్నది విశేషం" అన్నారు బాబాగారు

## స్వామి గుండెపోటును స్వీకరించుట

తరువాత నన్ను నా శ్రీమతిని మరియు నా బావమరది విజయశంకర్‌ను మరొక గదిలోనికి పిలిచారు. ఇంటర్వ్యూలో ఎన్నో ప్రశ్నలు వేసి అనుమాన నివృత్తి చేసుకుందామనుకున్నాను. అయితే నోరు పెగలలేదు. అతి బలవంతంమీద నోరు విప్పాను. "బాబా! ఒక చిన్న ప్రశ్న అడుగుతాను. ఆగ్రహించకండి! మన్నించండి! కోట్లాదిమందికి ఆశాకేంద్రం. లక్షలాది మంది భక్తులకు జ్ఞాన భిక్షను ప్రసాదించవలసిన తమబోటి మహనీయులు మరియు ప్రపంచ ప్రజానీకానికి శాంతి సందేశాన్ని అందించి సుఖ శాంతులను ప్రసాదించే మహత్కార్యాన్ని చేబట్టిన తమరు నాలాంటి అల్పజీవి ప్రాణాలకు అడ్డుపడి తమరు బాధపడుతుంటే, వేలాది మంది భక్తులు తీవ్రమైన ఆందోళనకు గురియైనారు. ఇది న్యాయమా? ఇది సబబా బాబా!" అని ఎంతో ధైర్యం చేసి వినయంగా అడిగాను. "అవును. నైనిటాల్ (యు. పి.) పోయే త్రోవలో బెల్లిన్ అనే గ్రామం ఉన్నది. అక్కడ ఒక మంచి స్వామి భక్తురాలున్నది. బాలవికాస్ గురువు. ఆ అమ్మకు ఐదుగురు పిల్లలు. భర్త త్రాగుమోతు. ఇంటి విషయాలు ఏమాత్రం పట్టించుకోడు. ఆ కుటుంబ భారమంతా ఆమెపై పడింది. చిన్న చిన్న ఉద్యోగాలు చేసుకుంటూ, కుటుంబాన్ని పోషించుకుంటూ, స్వామి కార్యక్రమాలను ఏమాత్రం అలక్ష్యం చేయకుండా శ్రద్ధగా చేస్తుంటుంది. ఒకరోజు (మే నెలలో)న ఒక ఉద్యోగం చేసి మరొక ఉద్యోగానికి పోతున్నది. దారిలో ఆమెకు గుండెపోటు వచ్చింది. ఆ బాధకు తట్టుకో

లేక " సాయిమా ! " అని బిగ్గరగా అరిచింది. ఆ కేక నాకు వినపడింది. భక్తులు తమకు కలిగిన బాధను తాము భరించుకోగల శక్తి ఉన్నప్పుడు నా అవసరం ఉండదు. భరించుకోలేనప్పుడు చేయి అందించాలి గదా ! అదే చేసాను. ఆమె గుండెపోటును నేను స్వీకరించి సమాధి లోనికి వెళ్ళాను. చుట్టుప్రక్కల నున్నవారు గాబరా పడ్డారు. డాక్టర్లను తీసుకొని వచ్చారు. వారు పరీక్షచేసి నాడి అందటంలేదన్నారు. బి. పి. పడిపోయిందన్నారు. అందరూ ఆందోళన చెందుతున్నారు. ఈ భౌతిక శరీరాన్ని తొందరపడి ఏం చేస్తారోనని భయపడ్డాను. వెంటనే తెలివి తెచ్చుకొని చుట్టూ ఉన్నవారికి ఈ సంఘటన చెప్పి, ఏమీ గాబరాపడవద్దు. రెండు రోజుల వరకు ఈ శరీరాన్ని కదపవద్దు అని చెప్పి సమాధిలోనికి వెళ్ళిపోయాను. తరువాత జరిగినదంతా భక్తులకు వివరించాను " అని చెప్పారు. తరువాత శరీర ధర్మాన్ని గురించి చక్కగా వివరిస్తూ " మీ శరీరమెంతో నా శరీరమంతే. అయితే 62 సంవత్సరాలున్న స్వామికి కాలునొప్పి కూడా లేదు. బాధలు నా దరికి చేరలేవు " అని చెప్పారు.

## స్వామి అవతారం

" శ్రీ రా మ చం ద్రు డు తన అవసానదశలో ఒక విషయం చెప్పాడు మనల్ని ఈ శరీరం వదలకమునుపే మనం ఈ శరీరాన్ని వదలివేయగలగాలి. అదే నేను చేస్తాను. ఏమీ భయపడకు. స్వామి ఈ శరీరంలో 96 సంవత్సరాలుంటాడు 6.వ సంవత్సరంలో ఏవిధంగా ఉన్నాడో 95 96 సంవత్సరాలలో కూడా ఈ స్వామి ఆ విధంగానే ఉంటాడు. ఏమాత్రం మార్పు ఉండదు. ఇంతవరకు వచ్చిన అవతారాలలో ఇది చాలా విశిష్టమైన అవతారం. (రెండుసార్లు అన్నారు) మరచిపోకు " అని స్పష్టంచేసారు. స్వామి అవతార రహస్యం గురించి స్వామి ముఖతః వినే మహాద్భాగ్యం నాకు కలిగినందులకు నేనెంతో సంతోషించాను. ఇటువంటి అవకాశం అందరికీ లభించదేమో !

## వివేకానంద అవతరణ

" బాబా ! ఈ మధ్య సిలోన్ నుంచి ఒక కుర్రవాడు ప్రశాంతినిలయం వచ్చాడుటగదా ! బాబా ! అతను పూర్వ జన్మలో వివేకానందని అంటున్నారు. ఇది నిజమేనా బాబా ! " అని అడిగాను. " అవును. అతని ప్రస్తుత పేరు కూడ 'నరేన్'. అవసరమైనప్పుడు మళ్ళీ వస్తాడు " అని ముక్తసరిగా బాబా సమాధానం చెప్పారు. పూర్వం ఒకపర్యాయం వివేకానంద అవతరణను గురించి బాబాగారే చెప్పారుట. బాబాగారు సిలోన్‌లో వున్న ఆ తల్లిదండ్రు లకు కలలో కనిపించి మీ అబ్బాయిని ప్రశాంతినిలయంకు తీసుకొని రమ్మనమని ఆదేశించగా వారు తీసుకొనివచ్చి నట్లుగా అక్కడి (ప్రశాంతినిలయం) భక్తులు చెప్పగా విన్నాను. ఈ సంఘటననుబట్టి ఆలోచిస్తే స్వామి లీలలు అనంతం. అసలు స్వామిని సామాన్యులు అర్థంచేసుకోవటంకూడా కష్టమేనేమో! స్వామికి తెలియనిది ఏమీ లేదనే విషయం స్పష్టమవుతున్నది.

## స్వామి దివ్యదృష్టి

" నిన్న నీకు కోపం వచ్చిందిగదా ! " అన్నారు బాబాగారు. " బాబా ! నేను ఏదైనా తప్పు చేస్తే, మన్నించండి ! క్షమించండి ! సరిదిద్దండి ! దూరం మాత్రం చేయకండి ! " అని అన్నాను. అప్పుడు చమత్కారంగా " నేను ఈ జుట్టును ఎందుకు పెంచుతున్నా ననుకుంటున్నావ్ ? చెవులు కూడా కనిపించకుండా పెంచే శాను. అన్ని విషయాలు లోపలికిపోవు. మధ్యలో Filter అయి మంచి విషయాలు మాత్రమే లోపలికి వినబడుతాయి. చెడు విషయాలు వినపడవు " అని చెప్పి నవ్వారు. వారు చెప్పినట్లుగానే నాకు కోపం వచ్చిన మాట వాస్తవమే. అది వారికి తెలియటమే విశేషం. సామాన్యులు తెలుసుకోలేరు. అదే వారికి మనకూ ఉన్న తేడా. సర్వం తెలిసినవారు కాబట్టే వారిని సర్వేశ్వ రుని అవతారమంటున్నారు. కోపం వచ్చిన సందర్భాన్ని కొంచెం వివరిస్తాను. అది 15 వ తేది. ప్రశాంతినిలయం వెళ్ళి అప్పటికి ఆరు రోజులయింది. బాబా ఇంటర్వ్యూకు

పిలువలేదు. అక్కడ ఆరురోజులుండి తిరిగి వద్దామను కుంటున్నాను. ఏమీ పాలుపోక 15 వ తేది రాత్రి బాబాగారి మందిరం వెనుక వున్న గది (బాబా విశ్రాంతి తీసుకొనే గది) ఎదురుగా నుంచొని నమస్కరించి "బాబా! నన్ను ఎందుకు పిలువలేదు. నేనేమైనా తప్పు చేశానా! బుద్ధిపూర్వకంగా నేనే తప్పు చేయలేదు. మానవుడ్ని గదా! తెలియక ఏమైనా తప్పు చేశానేమో! నేను అనేక రంగాలలో పోరాటం చేసి విజయాన్ని సాధించలేక పోయినాను. భ్రష్ట యోగిని. తలవని తలంపుగా మీ అనుగ్రహానికి పాత్రుడనైనాను. నాకు ఏ కోరికలు లేవు. మీ సేవా కార్యక్రమాలలో పాల్గొం టున్నాను. జీవితాంతం సాయి సందేశాన్ని గ్రామ గ్రామాన వినిపించాలని సంకల్పించుకున్నాను. ఇంటర్వ్యూలో మరి కొన్ని క్రొత్త విశేషాలు చెబితే, వాటిని ప్రజానీకానికి "శ్రీవాణి" ద్వారా అందించాలని తాపత్రయపడు తున్నాను. అంతే బాబా! ఇంక నాకే స్వార్థం లేదు. నన్ను నీవు తప్పనిసరిగా పిలవాల్సిందే. పిలిచేదాకా ఇక్కడనే ఉంటాను బాబా!" అని కొంచెం కటువుగానే చెప్పుతున్నాను. కళ్ళవెంబడి నీళ్ళు వచ్చాయి. తుడుచు కొని వెళ్ళిపోయాను. నా కోపం గురించి ఇంటర్వ్యూలో బాబా ప్రస్తావించినందులకు ఆశ్చర్యపడ్డాను. బాబాకు తెలియనిది ఏమీ లేదనేదానికి ఇది ఒక మచ్చుతునక. వారి దివ్యదృష్టికి నిదర్శనం.

## శివలింగ తీర్థం

నా శ్రీమతి ధైర్యంతో బాబాను ఒక చిన్న ప్రశ్న వేసింది. "బాబా! మాకు లోగడ శివలింగం సృష్టించి యిచ్చారు. దానికి అభిషేకం చేస్తున్నాం. తీర్థం పుచ్చుకుంటున్నాం. మరికొంతమంది భక్తులు వచ్చి తీర్థం కావాలని ప్రేమతో అడుగుతున్నారు తమకు నమస్కరించి వాళ్ళకు యిస్తున్నాం. మరికొంతమంది భక్తులు వచ్చి ఆ తీర్థం అందరికీ యివ్వకూడదు. శివ లింగం మీకు యిచ్చారు కాబట్టి మీరే తీసుకోవాలి. అట్లా అందరికీ యిస్తే దాని మహిమ తగ్గిపోయి కొంతకాలానికి శివలింగమే అదృశ్యమయిపోతుందని భయపెడుతున్నారు. మాకేమీ అర్థం కావటంలేదు. మేము చేస్తున్న పని ఒప్పా? తప్పా?" అని అడిగింది. బాబా నవ్వారు. "మనం పొందిన ప్రేమను పదిమందికి పంచాలి. హృదయం విశాలం కావాలి. హృదయం అంటే ఎడమ వైపున ఉండే గుండె (Heart) కాదు. అది Enlarge అవుతే హాస్పిటల్‌కు తీసుకొని వెళ్ళతారు. దాని విషయం వారు చూచుకుంటారు. హృదయం అంటే ప్రేమ. అది కుడివైపున ఉంటుంది. అది అందరికి పంచాలని చెబుతూ రామానుజాచార్యుల ఉదంతం వివరించారు. "పూర్వం రామానుజార్యులవారికి ఆయన గురువు "నారాయణ మంత్రము" ను ఉపదేశించారు. అది మోక్షప్రదాయని అని చెప్పారు. ఇతరులకు ఎవ్వరికీ చెప్పవద్దు. చెబితే తల పగిలి చచ్చిపోతావని హెచ్చ రించారు. అయితే రామానుజాచార్యులు తనకు ప్రాప్తించిన మోక్షమును అందరికీ ప్రసాదించాలని భావించి, గుడి గోపురం ఎక్కి వేలాదిమంది భక్తులకు "నారాయణ మంత్రము" ను పెద్దగా చెప్పి ఉపదేశించాడు. గురువు గారికి కోపం వచ్చింది. గురువాజ్ఞను ధిక్కరించి నందులకు రామానుజాచార్యులవారిని శపిస్తానన్నాడు అప్పుడు రామానుజాచార్యులవారు ఆనందంతో తల వంచి నమస్కరిస్తూ నేను ఏ శిక్షనైనా అనుభవిస్తాను. అయితే నా వలన వేలాదిమంది భక్తులు మోక్షం పొందటానికి అర్హులైనందుకు సంతోషిస్తున్నాను. నేనొక్కడ్ని పోయినా ఫరవాలేదనే ఆనందంతో గురువుగారికి చెబు తాడు అప్పుడు గురువర్యులు సహితం సంతోషించి గురువుకు తగ్గ శిష్యుడవని కౌగలించుకొని ఆశీర్వదిస్తాడు. కనుక ఎవరో పిచ్చి వాళ్ళు! తీర్థం యివ్వవద్దని చెప్పింది. సాయి ప్రేమను అందరికీ పంచు" అని బాబాగారు సవివరంగా చెప్పి నా శ్రీమతి అనుమానాన్ని తీర్చినందు లకు మేమెంతో సంతోషించాం.

## గ్రామసేవ

నా బావమరదిని చూచి "నీకు యిద్దరు మగపిల్లలు గదా! రెండవది అమ్మాయి అయితే బాగుంటుందనుకు

న్నావు గదా ! నీ ఉద్యోగంలో శాంతి ఉన్నదా ? " అని అడిగారు. స్పష్టంగా చెప్పలేకపోయాడు. " నాకు తెలుసు. నీవు అనేక ఆలోచనలు చేస్తుంటావ్. ఏం ఉద్యోగం చేస్తున్నావ్ ? " అని అడిగారు. " గ్రామీణ బ్యాంక్ మేనేజరుని. గ్రామాలలో ఉండటంవలన పిల్లల చదువులకు యిబ్బందిగా ఉన్నది. తమరనుగ్రహిస్తే తమ విద్యాలయమునకు మా పిల్లలను పంపుతాను " అన్నాడు విజయశంకర్. " మీబోటివాళ్ళకోసమే గదా నేను విద్యాసంస్థలను నెలకొల్పుతున్నది. గ్రామాలలో సేవ చేయటం నేర్చుకోవాలి. పట్టణాలలో ఏమున్నది, అక్కడ ఈర్ష్యాద్వేషాలు. బాగుపడితే ఓర్వలేరు. చెడిపోతే సహాయం చేయలేరు. అది అక్కడి పరిస్థితి. కనుక గ్రామసీమల ప్రజలను పైకి తీసుకొనిరావాలి. గ్రామసేవే రామసేవ గదా ! " అని చెప్పి గ్రామాల యెడల బాబా గారికి గల ప్రేమను స్పష్టంచేసారు. అందుకోసమనే సత్యసాయి సేవా సంస్థలు గ్రామాలను దత్తత తీసుకొని వాటి అభ్యున్నతికి కృషిచేస్తున్నాయి.

## స్వామి ఆశీస్సులు

చిట్టచివరికి త్యాగం యొక్క విశిష్టతను వివరిస్తూ " త్యాగంలోనే ఉన్నది యోగం, యోగంలో ఉన్నది భోగం " అంటూ " త్యాగేనైకే అమృతత్వమానశుః " అనే ఉపనిషద్వాక్యాన్ని గుర్తుచేసారు " నీవు రాజకీయాలలో నిష్కామకర్మ చేసావ్. త్యాగం చేసావ్. ఫలితాన్ని పొందలేకపోయినానని బాధపడుతున్నావు. 25-30 సంవ సంవత్సరాలు దేశదిమ్మరిగా తిరిగావు. ఏం సాధించావ్. అయితే అనాడు చేసిన స్వార్థరహితమైన త్యాగఫలితమే ఈనాటి నా సాంగత్యం. చేసిన త్యాగం ఎప్పటికీ నిష్ప్రయోజనం కాదు. అది ఏదో ఒక రూపంలో ఫలితాన్ని అందిస్తుంది " అన్నారు. అప్పుడు నేను " తమరాదేశించిన సేవా కార్యక్రమాలలో పాల్గొనేందుకు అవసరమైన శక్తి సామర్థ్యాలను యిచ్చి ఆశీర్వదించు బాబా ! " అని వేడుకున్నాను. బాబా మనస్ఫూర్తిగా దీవించారు. వారిచ్చిన విభూతి ప్రసాదమును తీసుకొని ఆనందంతో బయటకు వచ్చాం.

## స్వామి విభూతి

అది 18వ తేది. ఉదయం గం. 9-15 అయింది. భక్తులు భజన చేస్తున్నారు. బాబాగారు భక్తులను పరామర్శిస్తూ నా వద్దకు వచ్చి " ఈ పూట వెళ్ళుతున్నావుగదా ! అన్నారు. 'అవును' అన్నాను. చేయి ఎత్తి దీవించారు. హారతి యిచ్చే సమయం కావటంవలన బాబాగారు మందిరంలోనికి వెళ్ళి సింహాసనం మీద ఆశీనులయ్యారు. మరుక్షణంలోనే లేచి గదిలోనికి వెళ్ళి ఒక కవరుతో బయటకు వచ్చి ఒక కార్యకర్త(శ్రీ పటేల్)ను పిలిచారు. ఆయన పరుగెత్తుకుంటూ బాబా వద్దకు వెళ్ళాడు. దూరంగా కూర్చొనిన నన్ను చూపిస్తూ, నా ఆకారాన్ని వర్ణించి ఆ కవరు ఆ కార్యకర్తకు యిచ్చారు. బాబాకు వంద గజాల దూరంలో వేలమంది మధ్యలో కూర్చున్న నాకు, బాబాగారు చూపిస్తున్న వేలు నా హృదయాన్ని తాకినట్లుగా భావించి లేచి నుంచున్నాను. ఆ కార్యకర్త సరాసరి నా వద్దకు వచ్చి పేరు అడిగి కవరు యిచ్చి బాబా వైపుకు తిరిగి సంజ్ఞ ద్వారా " ఈనేనా " అని అడిగాడు. బాబా సరే నని చేయి ఊపారు. బాబాకు నమస్కరించాను. దూరంగా వుండే బాబా ఆశీర్వదించారు. ఆ కవరు సంచీలో పెట్టి నా వసతి గదికి వెళ్ళిన తరువాత బాబా ఫొటో వద్ద పెట్టి నమస్కరించాను తరువాత ఆ కవరును తెరిచాను. అందులో విభూతి పొట్లాలున్నాయి. నేను ఆశ్చర్యపోయాను. బాబా మరొక పర్యాయం ఊరికి వెళ్ళే ముందు ఆశీర్వదించినందులకు ఎంతో సంతోషించాను. బాబా భక్తుల యోగ క్షేమముల యెడల ఎంతటి శ్రద్ధ తీసుకుంటారో ఈ ఉదంతం ఋజువు చేస్తున్నది. బాబాతో ఏర్పడిన ఈ బంధానికి అది ఎప్పుడో ? అదేదో మనకు తెలియదు. బాబాకు మాత్రం తెలుసు నా గదిలో ఫొటో ముందు కూర్చొని సాయి భగవానుని మనసారా ప్రార్థించాను. అంతకు రెండురోజులకు పూర్వమే వ్రాసిన ఈ క్రింది కవితను చదివి ఆశీర్వదించమని భగవానుని మరొక పర్యాయం ప్రార్థించాను.

( తరువాయి 43వ పేజీలో )

# మహాభారత కథ ఎలా వచ్చింది?

**జనమేజయుడు** జనరంజకంగా రాజ్యం ఏలే రోజుల్లో ఒకనాడు వ్యాసభగవానుడు అతని సదనానికి వేంచేశారట.

అతని ఆగమనానికి ఆనందభరితుడై భక్తి ప్రపత్తులతో అర్ఘ్యపాద్యాదులర్పించి, సుఖాసీనుని చేసి సాష్టాంగ దండ ప్రణామంబులు చేసి –

తాతా మీ రాకతో నా గృహము పావనమయ్యె, నా జన్మ ధన్యమయ్యె మీ అభీష్టమెద్దియో సెలవిండు అన్నాడట, "ఊరక రారు మహాత్ములు" అనే ఆర్యోక్తి తెలిసిన వాడై.

వ్యాసభగవానుడు, అతని ఆతిధ్యానికి సంతుష్టాంతరంగుడై క్షేమ మడిగి కుశలప్రశ్నలు వేసి, నీ తాత తండ్రులతో వనధర్మతత్పరుడవయి రాజ్యభారము నడుపుదువే ! దీనుల నాదరింతువే ? అని కొన్ని మాటలు అడిగినాడు

జనమేజయునకు గొప్ప సందేహం వచ్చింది. ఈయన ఆనాడు మా తాతలకు హితవు చెప్పి ఉంటె రాజ్యంకోసం పోరు సలిపేవారు కాదు. జన క్షయం, వంశ నాశనం అయ్యేది కాదు. ఇతను చెప్పలేదా ? వారు వినలేదా ? అని.

అదే, అతి వినయంగా, తాతా ! మీకు భూతభవిష్యత్ వర్తమానాలన్నీ తెలుసు. ఆనాడు మా తాతలను మీరు వారించి ఉంటె యుద్ధానికి సిద్ధమయ్యేవారు కాదు. వంశనాశనం, జన క్షయం జరిగేది కాదు కదా ! అన్నాడు.

జనమేజయుని చూచి చిరునవ్వుతో, చెప్పాను నాయనా అన్నాడు వ్యాసుడు.

తల అడ్డంగా ఊపాడు జనమేజయుడు. క్షమించాలి చెప్పిఉండరు. మా తాతలు మీ ఆజ్ఞలు శిరసావహించే వారేకద ! అంటూ.

ప్రారబ్ధకర్మ నెవరూ తప్పించలేరు నాయనా ! కర్మననుసరించి బుద్ధి నడుస్తుంది. హితోక్తులు రుచించవు. సరె. గతమేదో జరిగిపోయింది. నువ్వు నా మాట ప్రకారం నడుచుకుంటావు కద ? అన్నాడు, వ్యాసుడు.

తప్పక మీ మాట నాకు శిరోధార్యం అన్నాడు జనమేజయుడు.

కావిలిపాటి విజయలక్ష్మి

అయితే విను. కొంతకాలానికి ఈ నగరానికి పంచకల్యాణీ గుఱ్ఱాలు వస్తాయి. ముచ్చటపడి కొనేవు సుమా! కొనకు. కొంటె కొన్నావు. సాలలో కట్టకు. కడితే కట్టావు స్వారీ చేయకు. స్వారీ చేస్తే చేశావు ఉత్తర దిక్కుగా వెళ్ళకు. వెళితే వెళ్ళావు. అక్కడ వున్న వారితో మాట్లాడకు. మాట్లాడితే మాట్లాడావు వారు చెప్పిన పని చెయ్యకు. ఇందులో ఏ ఒక్కటి మానినా నీకు కీడు జరగదు. అని చెప్పి వెళ్ళిపోయాడు వేదవ్యాసుడు. అసలు నేనా గుఱ్ఱాలనే కొనను. అని దృఢంగా పలికాడు జనమేజయుడు తాత దగ్గర.

కొంతకాలం గడిచింది. అందమయిన పంచకల్యాణీ గుఱ్ఱాలు పట్నానికొచ్చాయి. జనం ముచ్చటపడి చూస్తున్నారు. ఒకటే కోలాహలం.

చూస్తే ఏమిలే అనుకున్న జనమేజయుడు గుఱ్ఱాల్ని చూసి అచ్చెరువందాడు. ఎప్పుడూ కనీ వినీ ఎరుగని అపురూపమైన గుర్రాలవి. కనురెప్పలు వాల్చలేకపోయాడు. మనస్సు చెదిరింది. ఒక గుఱ్ఱం కొనాలనే కోరిక రేగింది. ఈ గుఱ్ఱం వెల ఇచ్చి కొనలేని నా సంపద ఎందుకూ పో అనుకున్నాడు.

ఒక గుర్రాన్ని కొన్నాడు.

## బ్రతుకు

I slept and dreamed
that life was beauty
I woke and found
that life was duty

నిద్రించి కల గంటి
జీవిత మతి సుందరమని;
మేల్కాంచి కనుగొంటి
బ్రతుకు ఒక బాధ్యతయని

— జంగా గోపాల్

తాత సాలలో కట్టవద్దనికదా అన్నాడు ! అని అశ్వం బయట కట్టించాడు.

వారం గడిచింది. గుఱ్ఱం వసివాడినట్లనిపించింది. విచారపడ్డాడు, నొచ్చుకున్నాడు. పూవును నేల రాస్తున్నానే అని బాధపడ్డాడు. తాత స్వారీ చెయ్యవద్దని కదా అన్నాడు అనుకుని సాలలో కట్టించాడు. సంరక్షణ జరుగుతూంది.

కొంతకాలం గడిచింది. రోజు రోజూ కొంతసేపు గుర్రాన్ని చూసి ఆనందిస్తున్నాడు. గుఱ్ఱం బలిసి మిస మిసలాడుతూ మిడిసిపడుతోంది.

ఒకనాడు జనమేజయునకు గుఱ్ఱమెక్కి స్వారీ చెయ్యాలని మనస్సు ఉవ్విళ్ళూరింది.

తాత ఉత్తరదిక్కుగా కదా పయనించరాదన్నాడు ? తూర్పు దిక్కుగా వేటకు వెళతాను అని నిర్ణయించుకున్నాడు.

వ్యాసమహర్షి మాట మంత్రులు గుర్తుచేసి వారించినా వారి మాటలు పట్టించుకోలేదు.

ఉత్సాహంగా గుఱ్ఱమెక్కి కళ్ళెం పట్టాడు.

ఉత్తర దిక్కుగా దౌడు తీసింది గుఱ్ఱం. ఎంత అదలించినా మరొక దిక్కుకు మళ్ళదే.

విధి విలాసం.

అరణ్య మధ్యంలో, ఉద్యానవనంలో చంద్రకాంత పేటిక చెంత అలసటగా ఆగింది గుఱ్ఱం.

ఆ పేటికలో అందమైన స్త్రీ కూర్చుని బిగ్గరగా ఆర్తనాదం చేస్తూంది.

కదలి పోయాడు రాజు. చర్రున గుఱ్ఱం దిగాడు. వడివడిగా ఆమె చెంతకు నడిచాడు.

అమ్మా ఆపద ఏమిటని ప్రశ్నించాడు ఆత్రంగా.

ఆమె భయభ్రాంతురాలయినట్లు బెదురు చూపులు చూస్తూ, ఒక పుట్టవైపు చెయ్యి చాపి చూపి రాజా! అందులో నుంచి ఒక మహా సర్పము వచ్చి ప్రతిదినమూ నన్ను వేధించుచున్నది. అని చెప్పింది.

ఒరలోంచి కత్తి తీసి పుట్ట నరికాడు రాజు.

ఒక ముని శిరస్సు తెగి పడింది.

గుఱ్ఱం లేదు. ఉద్యానవనంలేదు. చంద్రకాంత పేటిక లేదు. అందమైన స్త్రీ లేదు.

అరణ్య మధ్యంలో ఏకాకిగా మిగిలిపోయాడు రాజు.

ఉద్యానవనం, చంద్రకాంత పేటిక, వంటరి స్త్రీ ఆర్తనాదం, ఇవన్నీ ఇక్కడ ఎలా సంభవం !

కటకటా ఎంత వివేక శూన్యుడనైతిని ః తాతా ! నువ్వు మహా మహిమాన్వితుడవయ్యా ! అని విచారించి కాలినడకన గమ్యం చేరాడు రాజు.

మునిని చంపిన పాపం బ్రహ్మహత్యాపాతకం. అతని వళ్ళు బొల్లి విడిచింది.

తాతను ప్రార్థించాడు

వ్యాసులవారు వేంచేశారు. జరిగిన కథ విన్నారు. పశ్చాత్తాపంతో. బాధతో కుమిలే మనుమని ఓదార్చారు.

మహాభారత కథ నా శిష్యుడు వైశంపాయనుడు చెబుతాడు శ్రద్ధగా విను. పాపపరిహారం అవుతుంది, రోగ విముక్తుడవవుతావు అని చెప్పి అంతర్ధానమయ్యాడు వ్యాసుడు.

మహాభారత కథ వైశంపాయనుని వలన విని, పాతక విముక్తుడై తేజోవిభవాలు పొందాడట జనమేజయుడు. ★

# ఎడారిలో 500 గంటలు

రష్యాలోని 'కారా - కుం' ఎడారి విస్తీర్ణం మూడు లక్షల ఏభై వేల చదరపు కిలోమీటర్లు. ఈ ఎడారిని కాలి నడకన ఏడుగురు రష్యన్స్ దాటడానికి వుద్యమించారు. 37 సంవత్సరాల విశోలామ్ అనే డాక్టర్ ఈ దళానికి లీడర్. మిగతావారి వయసు 30 నించి 35 లోపు. ఒకతని వయసు మాత్రం 25.

## మనకు తెలియని ప్రపంచం

మల్లాది వెంకటకృష్ణమూర్తి

మనిషి కాలినడకన ఎడారి దాటడంలో చేసే ప్రయత్నంలో అతని శరీరంలో జరిగిన మార్పులని సైంటిఫిక్‌గా పరీక్షించడానికి ఆ సాహసయాత్రలో నాలుగు మెడికల్ ఇన్‌స్టిట్యూషన్స్ ఏర్పాటు చేశాయి. కొందరు నిపుణులు వారికి కొద్ది దూరంలో కనబడకుండా ఎడారిలో ప్రయాణం చేసి నిర్ణీత సమయంలో వైద్యపరీక్షలు చేశారు.

మొత్తం ఏడు లక్షల 20 వేల అడుగులు నడచి వారు ఆ ఎడారిని దాటారు. కూడా యేపుల్లాలాంటివి తీసుకెళ్ళకుండా బావులు, ఒయాసిస్సులని బట్టి తమ ప్రయాణం సాగించారు. ఆ ఎడారిలో వాతావరణం ఉదయం 59° సెంటిగ్రేడ్ వేడి, రాత్రులు 59° లలో జీరో శీతలం. పగలు విశ్రాంతి తీసుకొని రాత్రుళ్ళు ఒకసారి, రాత్రుళ్ళు విశ్రాంతి తీసుకొని పగలు, నడక సాగించారు. మాంసం సూప్ కలసిన ట్యూబ్‌లలో నింపిన ఓ ప్రత్యేకమయిన భోజనం వారు తీసుకున్నారు. వంట చేయడం చేయలేదు.

నిమిషానికి 120 అడుగుల చొప్పున, గంటకి ఆరు కిలోమీటర్ల దూరం మాత్రమే వారు నడిచేవారు. ప్రతి రోజూ నడక ఆపినాక వారికి వైద్య పరీక్షలు చేసేవారు. అవి అయ్యేదాకా మంచినీళ్ళు కూడా తాగ కూడదు. విశ్రాంతి తీసుకోకూడదు. స్నానం చేయకూడదు.

వారి వెంట ప్రెస్ ఫోటో గ్రాఫర్ ఒకతను వెళ్ళి దారి పొడుగున అనేక ఫోటోలు తీశాడు. హాలెండ్‌లో జరిగిన వరల్డ్ ఫోటో ఎగ్జిబిషన్‌లో ఆ ఫోటోగ్రాఫర్ వాలి అమీకకి "గోల్డెన్ ఐ" బహుమతి లభించింది. ఇసుక తుఫానులు వచ్చినప్పుడు మొహానికి ఇసుక తగలకుండా ఓ ఆచ్ఛాదనం ధరించి, తలకి టోపీ పెట్టుకునేవారు. వారికి కావలసిన ఆహార పదార్థాలు, ఇతర సామాగ్రిని వాళ్ళే భుజాలనించి వీపుమీద వేలాడే సంచుల్లో మోసుకు వెళ్లారు. నిద్ర పోవటానికి తెల్లటి గుడారం వేసుకునేవారు.

దాదాపు మూడు వేల కిలోమీటర్లు నడిచి ఆ ఎడారిని దాటటానికి వారు మొత్తం 500 గంటలపాటు నడిచారు. ★

## జల సంపద

భూగోళంమీదనున్న మొత్తం నీటి ఘన పరిమాణంలో 97.3 శాతం సముద్రాల్లోను, భూమిపైనున్న సముద్రాలలో వ్యాపించి వున్నది. మిగతా 2.7 శాతం మంచు రూపంలోను, నదుల్లోను, భూగర్భంలోను వున్నది. సముద్రాల్లో ఉన్న నీటి ఘనపరిమాణం 30,84,00,000 ఘనపు మైళ్ళు. భూమిపైనున్న మంచినీరు 84 లక్షల ఘనపుమైళ్ళు. ప్రపంచంలోని నదీజలాల్లో 12 శాతం మాత్రమే మానవులు వినియోగించుకుంటున్నారు

— జే. నరేంద్రదేవ్

(విశ్వ విజ్ఞానదర్శిని నుండి)

# మధ్య తరగతి మందహాసం

ఒకప్పుడు భారత స్వాతంత్ర్య సమరంలో ఎక్కువగా పాల్గొన్నది ధనవంతులు - మధ్యతరగతివారు మాత్రమే. స్వాతంత్ర్యం వచ్చాక "అమ్మయ్యా స్వాతంత్ర్యం వచ్చేసింది" అంటూ మధ్య తరగతివారు హాయిగా నిద్రపోయారు. ఖర్చు పెట్టిన డబ్బును గురించి ధనవంతులు లాభనష్టాల లెక్కల్లో మునిగి పోయారు. అసలు స్వరాజ్యానికి పర రాజ్యానికి తేడా తెలియని అట్టడుగు వర్గాలన్నీ తమ దారిన తాామున్నాయి యథాప్రకారంగా పనిపాటలు చూసుకుంటూ. ఆంధ్రదేశంలో ఆ విధంగా నిద్రపోయిన మధ్య తరగతి వారంతా నిద్ర లేచేసరికి వారి నెత్తిన ఎన్ని క్వింటాళ్ళ బరువులు పేర్చ బడ్డాయో గ్రహించడానికి ఆట్టే రోజులు గడవలేదు. గ్రహించాక అవి దించుకొని పైకి చూసే వీలులేక నడుం వంగి చూపులు భూమాతమీదే నిలపాల్సివచ్చింది.




జొన్నలగడ్డ లలితా దేవి

మధ్యతరగతివారు ఎదుర్కొని సమస్యలంటూ ఏమున్నాయో నాకు అర్థం కాదు. పిల్లల చదువు సమస్య-నిరుద్యోగ సమస్య - ఆడపిల్లల పెళ్లి సమస్య - ఇంటి సమస్య - ఒక ఒకటేమిటి జీవించటానికి అవసరమయ్యే అన్ని విషయాల్లోనూ మధ్యతరగతి గృహిణి నలిగిపోతూ వుండవలసిందే.

అసలు నిజాయితీగా టాక్సులు కట్టేది కూడా ఉద్యోగులు మాత్రమే - ఆఫీసుల్లో ఖచ్చితంగా మినహాయించుకునేగా జీతాలు ఇచ్చేది.

ఆంధ్రప్రదేశ్‌లో పురుష ఓటర్లకంటే స్త్రీ ఓటర్ల సంఖ్యే ఎక్కువ. అయితే ఈ ఓటర్లలో మధ్యతరగతి మగువలు ఎందరున్నా వారికి లాభించే ఏ పథకాలనూ ఏ ప్రభుత్వం త్వరగా చేపట్టదు.

ఆడవారికి ఆస్తిలో హక్కు ఇచ్చాం అంటారు పెద్దలు. ఆ ఆస్తి హక్కు శాసనం వల్ల ఎవరికి ఉపయోగం! అది ఆస్తి ఉన్నవారికి ఏమన్నా లాభిస్తుందేమో గాని మధ్య తరగతి ఆడపిల్లలకు ఏం ఉపకరిస్తుందాచట్టం! ఎంతమంది మధ్య తరగతివారి దగ్గర ఆస్తులు పంచడానికి డబ్బు వుంది? ఆస్తులుంటే ధనవంతుల కోవలోనే నడుస్తారు గదా! ఓ ఉద్యోగి అతను రిటైరయ్యేసరికి అందే డబ్బు తప్ప వేరే ఆస్తి ఏం వస్తుంది. నెలసరి జీతాల్లో - ఏం మిగులుస్తారు? ఏం దాచగలుగుతారు?

రిటైరయ్యేసరికి వచ్చే ప్రావిడెంట్ ఫండ్ వగైరాలతో ఏదో ఆడపిల్లలకి పెళ్ళి చేసి తగిన కట్న కానుకలతో పంపాలనుకుంటారే గాని ఆస్తి పంచిపెట్టాలనుకోరు. అందుచేత అది ధనవంతులకే ఉపయోగపడుతుందని మనం నమస్కారం చేయాల్సిందే వరకట్న నిషేధం బిల్లు ఎంత ఉపయోగకారి అయిందో ఇది కూడా అంతే -

ఏది ఎలా వున్నా ముందు ఏ రాకెట్ ఎక్కనవసరం లేకుండానే అద్దెలు చంద్రమండలానికి చేరుకున్నాయి. ఏ సరుకు కొందామన్నా - కూరలు, కొందామన్నా చుక్కల్లో వుంటాయి ధరలు - ఈ ధరలు అరికట్టడం అనేద ఎవరివల్లా కాని పని అని తేలిపోతోంది. అతి వృష్టి - అనావృష్టి ప్రభావం కూడా ఆఖరుకు మధ్య తరగతి వాళ్ళమీదే వుంటుంది.

తెల్లవారి లేస్తే పంపులో నీళ్ళు వస్తాయో రావో అన్న బాధతోనే కలతనిద్రపోవాలి. ఆ గంగాభవాని దయ - వస్తే వస్తాయి లేకపోతే నీళ్ళకోసం కూడా అన్వేషణ ప్రారంభించాలి. ఆ మధ్య దొనేషన్లు రద్దు చేశారంటూ

చెబితే నాలాంటివాళ్ళు సంతోషించబోయి వెంటనే కూల బడ్డారు. ఎందుకంటే కాలేజీల దాకా పోనక్కర్లేకుండానే కె. జి. క్లాసుల దగ్గర్నుంచే వసూలు చేస్తున్నారు వేలకి వేలని తెలిసి - పిల్లలకి యూనిఫాంలు - లాంఛనాలు తప్పనిసరి - స్కూల్లో సీటు దగ్గర్నుంచి పిల్లల్ని రోజూ స్కూలుకు తీసుకుపోయి దించడం వరకూ అమ్మగారిదే డ్యూటీ - అన్ని స్కూళ్ళకీ బస్ సౌకర్యాలుండవు - ఇన్ని విధాల కష్టపడి చదివించుకుంటూ వస్తే రేపొద్దున వాళ్ళకి ఉద్యోగాలు దొరికిపోయి మనల్ని ఆదుకుంటారన్న గ్యారంటీ ఏమీ లేదు. వంట గ్యాస్ దొరకని బాధ. సిలిండర్ అయిపోతే తిప్పలే - నెలదాకా రాదు. అప్పుడే సమయానికి కిరసనాయిలు కూడా దొరకదు. బ్లాకున కొనాలి. మరి ఏ పాటు తప్పినా సాపాటు తప్పదుగదా!

ప్రతి మనిషికీ ఓ యిల్లు కట్టుకోవాలని కోరిక వుంటుంది. కాని సాధ్యపడాలి - ఆయనగారి ఆర్జనకి అప్పు పుట్టాలి. పేదవారికి ఇళ్లు కట్టించి ఇస్తామన్న ప్రభుత్వాలు మధ్య తరగతి వారిని మచుకు గుర్తు పెట్టుకోరు -

ఏ చట్టాలు - ఏ శాసనాలు - ఏ పథకాలు అయినా అటు గొప్పవారికో - ఇటు పేదవారికో ఉపయోగిస్తాయి గాని మధ్య తరగతివారికి మచుకు లాభించవు - అద్దెలు కట్టుకోలేక - సరుకులు కొనలేక - పిల్లల్ని చదివించుకో లేక - పెళ్లిళ్ళు చేయలేక - అలా అని ఇవన్నీ చేయ కుండానూ వుండలేక గరళం కంఠంలో దాచుకొని పైకి నవ్వుతూ తిరగడం ఒక్క వీరికే చెల్లింది. ★

# ఆణిముత్యాలు

" తప్పు చేయడం మానవ స్వభావం. తిరిగి ఆ తప్పును చేయకుండా వుండటం దైవ స్వభావం. తప్పును క్షమించడం కూడా మానవ స్వభావమే. దుర్బ లులు ఎప్పుడూ క్షమించలేరు. క్షమించడం సబలుల లక్షణం "

— శ్రీ మహాత్మా గాంధీ

" సేవ వలన అహంకార రాహిత్యం, ఆనందప్రాప్తి లభించును. సేవాతత్వమే మానవుని అహంకారమును దూరముచేయు యంత్రము, తంత్రము, మంత్రము. సేవ యనగా మానవసేవ; పీడిత ప్రజల సముద్ధరణ. మానవ సేవయే మాధవసేవ గదా! "

— శ్రీ సత్యసాయిబాబా

" తోటి మానవుల జీవితంలో కలిసి మెలిసి ఉండ టమే భగవంతునితో వుండి అతని సేవ చేయడం. భగవత్సేవకోసం ప్రపంచ కార్యాలను వదలనక్కరలేదు. భగవంతునికి చోటు చేయడానికని తోటి మానవుని త్రోసి వేయ నక్కరలేదు. భగవంతునికోసం హృదయం చోటు చేస్తే సర్వ ప్రపంచానికి చోటు చేసినట్లే "

— శ్రీ రవీంద్రనాథ టాగూర్

" వాదములూ, తర్కములూ ఎప్పుడూ నిష్ఫలములే. వాదాలతో భేదాలు పోగొట్ట ప్రయత్నించడంవల్ల అసం తృప్తీ, విరోధమూ పెరుగుతాయి. మొదట హృద యాన్ని జయించు. తరువాత హేతువుతో మనస్సును ఒప్పించు. వాదం విఫలమైనచోట ప్రేమ విజయం పొందగలదు. "

— శ్రీ స్వామి రామతీర్థ

" సంతృప్తిలేని జీవితానికి శాంతి లేదు. అసంతృప్తి లేని జీవితానికి వృద్ధి లేదు. "

— శ్రీ నార్ల వెంకటేశ్వరరావు

భృగేశ్వరరావు పెట్టిన కేకకి హాలు అదిరిపోయింది.

సస్పెన్సుతో సినిమా చూస్తున్న వాళ్ళకి ఆ కేక ఎక్కణ్ణించి వచ్చిందో ఒక్క క్షణంపాటు అర్థంకాలేదు.

సినిమా ఆపరేటరు రమణయ్య కూడా ఒక్క క్షణంపాటు విస్తుపోయ్యాడు.




అసలు ఆ సమయంలో అలాంటి కేక ఎలా వచ్చిందో అతనికి అంతుపట్టలేదు.

'బహుశ ఎవరో సినిమా చూస్తూ భయపడి అరచి వుంటారు' అనుకున్నాడు.

కానీ అతని మనస్సు అలా సర్ది చెప్పుకోవటానికి అంగీకరించలేదు. అది మామూలుగా భయంతో వేసిన కేకలా లేదు.

'చావుకేక'లా వుంది

చనిపోయేముందు మనిషి తన సర్వశక్తులూ క్రోడీకరించి వేసిన కేకలా వుంది.

ఇక రమణయ్యకి క్షణం కూడా అక్కడ నుంచోబుద్ధి కాలేదు. చేస్తున్న పని అసిస్టెంట్‌కి అప్పగించి గబగబ హాల్లోకి పరిగెత్తాడు.

భృగేశ్వరరావు చెయ్యి కదెస్తుగా ఆమె కడుపులో దిగబడ్డ కత్తి పిడిమీద వడ్డది.

ఇంకా ఎండిపోని రక్తం జిగట జిగటగా అతని చేతికి అంటుకుంది.

ఒక్క క్షణంపాటు అనుకోని ఈ సంఘటనకి అతను షాక్ తిన్నాడు. అప్రయత్నంగా అతని నోటివెంట ఆ కేక వచ్చింది.

ఆ నిజాన్ని హరాయించుకోలేని అతని రక్తనాళాలు చిట్లిపొయ్యాయి.

ఇదంతా రెప్పపాటులో జరిగింది.

అంతే !

ఒక్క క్షణం నిశ్శబ్దం ....

మరుక్షణంలో ....

బాల్కనీలో వున్న కొద్దిమంది ఆ కేక వినవచ్చినవైపు చూడసాగారు. ఎవరికీ వెళ్ళటానికి ధైర్యం చాలటం లేదు

చెమట్లతో పరిగెత్తుకుంటూ వచ్చిన రమణయ్య డోర్ తీసుకొని లోపలకి వచ్చాడు.

అక్కడ కూర్చున్న వాళ్ళని ఏమయిందని అడిగాడు.

"ఏంటోనయ్యా సినిమా చూస్తుంటే కేక విన్పించింది" అంటూ అటువైపు చూపాడొకడు.

రమణయ్య ఒక్క అంగలో స్విచ్ బోర్డు దగ్గరికి పరిగెత్తాడు.

గబుక్కున స్విచ్‌లన్నీ నొక్కాడు. బాల్కనీ అంతా దేదీవ్యమానంగా వెలుతురు పరుచుకుంది.

అంతవరకూ అటువైపు వెళ్ళటానికి ధైర్యం చాలని వాళ్ళు కూడా అటువైపు పరిగెత్తారు.

అందర్నీ తోసుకుంటూ ముందుకు వెళ్ళిన రమణయ్య నోటివెంట అప్రయత్నంగా 'హత్య' అన్నమాట వెలువడింది.

'ఒకటి కాదు రెండు' అనుకున్నాడు తనలో తాను గొణుక్కున్నట్టుగా.

ఆ దృశ్యం చూస్తే ఎంతటి ధైర్యవంతుడికైనా భయం పుట్టించే లాగుంది.

(జ రి గి న క థ)

సినిమా చూస్తున్న ఆలేఖ్య కళ్ళకి 'చమక్' మని మెరుపు మెరసినట్లయ్యింది. ఆమె ముందర కూర్చున్న జంటలో మొగవాడు కత్తితో ఆ అమ్మాయి కడుపులో పొడిచాడు. ఆలేఖ్య అక్కడ్నుంచి పారిపోవటానికి చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. అతడు ఆలేఖ్య మెడమీద కొట్టడంతో ఆమె కుప్పకూలి పోయింది. ఈ విషయాలు తెలియని భృగేశ్వరరావు ఆ అమ్మాయి ప్రక్కకు వచ్చి నెమ్మదిగా ఆమె పొట్టమీద చెయ్యి వేశాడు. అంతే !

(ఇక చదవండి)

సీట్లో అచేతనంగా పడియున్న ఆ యువతి శవం. ఆమె కడుపులో దిగబడ్డ కత్తి. ఆ కత్తి మీద ఆ మధ్య వయస్కుడి చెయ్యి. అతను మరీ భీకరంగా వున్నాడు. అతని కనుగ్రుడ్లు భయంతో బయటకొచ్చాయి. నోరు కూడా తెరిచేవుంది.

"గట్టిగా అరచింది ఇతనే అయ్యుంటాడు" అనుకున్నాడు రమణయ్య భృగేశ్వరరావు నోటి వంక చూసి.

తెప్పరిల్లిన రమణయ్య గిర్రున వెనక్కి తిరిగి బయటకి పరిగెత్తాడు.

క్రింద క్లాసులో కూర్చున్న ప్రేక్షకులకి పైన జరిగింది ఏంటో అర్థం కాలేదు.

"పైన ఏం జరిగింది ?" అన్న ప్రశ్న కేక విన్న ప్రతి ఒక్కడి మనసులో ఉదయించింది.

ఇంతలో సినిమా ఆగిపోయింది.

రొప్పుతూ రమణయ్య "మేనేజర్" అన్న బోర్డ్ వున్న రూమ్‌లోకి విసురుగా వెళ్ళాడు.

హాలువల్ల లాభాలు రావటంలేదని ఏకలింగం ఉన్న మేనేజర్‌ని పీకేసి తనే ఓనర్ కమ్ మేనేజరుగా లాక్కొస్తున్నాడు. మనిషిమాత్రం గుంభ్రంగా వుంటాడు.

" ఛీ .... ఛీ .... సినిమాకి ఇంత పబ్లిసిటీ ఇచ్చినా హాలిడేరోజు కూడా హౌస్‌ఫుల్ కాలేదంటే ఈ హాలుని ఆ భగవంతుడే రక్షించాలి " అంటూ తనకిష్టమయిన అభయాంజనేయస్వామిని తలుచుకున్నాడు.

" సార్ " అన్న పిలుపుతో కాదు కేకతో ఈ లోకం లోకి వచ్చాడు ఏకలింగం.

ఎదురుగా తడిసి ముద్దయి రొప్పుతూ రమణయ్య కన్పించాడు.

అసలే చిరాకులో వున్నాడేమో " ఏంటయ్యా ? ఆఁ .... ఏంటి ? ఆ కంగారేంటి ? ఎవరో చచ్చినట్టు ! నెమ్మదిగా పిలవలేవా ? " అంటూ ఫైర్ అయిపోసాగాడు.

" అవునండి ఒకళ్ళు కాదు .... ఇద్దరు " అన్నాడు ఆయాసంతో రొప్పుతూ.

" ఏరోయ్ నాతోనే వేస్తున్నావా జోక్సు " అన్నాడు కళ్ళెఱ్రజేస్తూ.

" కాద్సార్ బాల్కనీలో రెండు హత్యలు జరిగాయి సార్ "

" హత్య " అన్న మాట చెవినపడగానే మత్తు దిగి నట్లయ్యింది ఏకలింగానికి.

" వ్వాట్ నువ్వు తెలివి వుండే మాట్లాడుతున్నావా ? మన హాల్లో హత్యలా ? " అని గట్టిగా అరిచాడు ఇంకా నమ్మకం కుదరక.

" ఔన్సార్ " అంటూ అప్పటిదాకా బిగబట్టివున్న ఏడుపు అతని గొంతు దాటింది.

దాంతో ఏకలింగం కంగారు పడిపోయి తన భారీ కాయాన్ని మోసుకుంటూ ముందరకి దారితీశాడు.

చిన్నగా షేక్ అవుతున్న శరీరాన్ని అదుపులో వుంచుకుంటూ బాల్కనీలోకి ప్రవేశించాడు ఏకలింగం.

అప్పటికే అక్కడ జనాలు చుట్టుముట్టి ఎవరికి తోచిన వ్యాఖ్యలు వాళ్ళు చేస్తున్నారు. వాళ్ళందరి మధ్యనుంచి దారి చేసుకొని దగ్గరకి వెళ్ళాడు ఏకలింగం.

ఆ రెండు శవాలని చూట్టంతోనే ఏకలింగం నోటివెంట మాట పెగల్లేదు. ఇంతకాలం ఈ నగరంలో బయట హత్యలు జరగటమే కాని ఇలా సినిమాహాల్లో ఇంతవరకూ జరగలేదు.

గుమిగూడి వున్న జనాల్ని దూరంగా జరగమని రెట్టింపు వేగంతో తన రూమ్ వైపు దారితీశాడు.

ఫోనందుకుని పోలీస్‌స్టేషన్‌కు రింగ్ చేశాడు వణికే చేతులతో.

" హలో నేను మయూరిహాలు ప్రొప్రయిటర్‌ని - మాట్లాడుతున్నా. ఒక్కసారి యస్. ఐ గార్కి ఫోనిస్తారా ! .... నమస్తేసార్ ఇక్కడ మా హాల్లో రెండు హత్యలు జరిగాయి. మీరు అర్జెంటుగా రండి " అంటూ ఇంక ఓపిక లేనివాడిలా నిస్సత్తువుగా ఫోన్ పెట్టేసి అక్కడున్న కుర్చీలో కూలబడిపొయ్యాడు. దీనంగా అక్కడున్న అభయాంజనేయస్వామి ఫోటోవంక చూశాడు.

ఆయన నవ్వుతూ ఏకలింగం వంక చూశాడు.

" అయిపోయింది ఈ హాలు పని అయిపోయింది. ఏ ముహూర్తంలో తీసుకున్నానో కాని అంతా సర్వ నాశనం అయిపోయింది " అనుకుంటూ అలవాటు ప్రకారం అభయాంజనేయస్వామి దండకం చదవబొయ్యాడు. కానీ కంగారులో అదీ గుర్తుకు రాక రెండు చేతులెత్తి ఫోటోకి దండంబెట్టి కళ్ళు మూసుకున్నాడు.

హాల్లో కలకలం రేగింది. కిందకూర్చున్నవాళ్ళు పై వాళ్ళని కేకేసి ఏం జరిగిందని అడగటం వాళ్ళు చెప్పటంతో తలొక విధంగా చెప్పుకోసాగారు.

కొంతమంది ఉత్సాహవంతులు పైన ఏం జరిగిందో తెలుసుకుందామని తోసుకుంటూ పైకి వెళ్ళసాగారు.

కిందవాళ్ళని ఎవర్నీ పైకి వెళ్ళనివ్వకుండా మెట్లదగ్గర గేటుకీపర్లు సతమతమవుతున్నారు. వాళ్ళని తోసుకుంటూ వెళ్దామని ట్రై చేస్తున్నారు.

బాల్కనీలో కూర్చున్న వాళ్ళకు ఎప్పుడు బైటికి వెళ్దామా అన్నట్లుంది. మళ్ళా పోలీసులు వస్తే కేసు. కోర్టుల చుట్టూ తిరగటం ఇవన్నీ తలుచుకున్నకొద్దీ వాళ్ళకి భయంగావుంది. తలుపులు వేయటంతో పైన ఫ్యాన్‌లు తిరుగుతున్నా ఉక్క ఆగటం లేదు వాళ్ళకి.

హాల్లో జనాలు అటూ ఇటూ తిరగటం ఇవన్నీ చూసేసరికి రోడ్డుమీద వెళ్ళే వాళ్ళకి లోపల ఏదో జరుగకూడనిది జరిగిందని అర్థమయింది. నెమ్మదిగా గేట్ దగ్గర పెద్ద గుంపు తయారయింది.

గేట్‌కీపర్ ద్వారా లోపల జరిగింది తెలుసుకున్నారు. దాంతో బయట కూడా కలకలం చెలరేగింది.

ఇంతలో పోలీస్ జీప్, దానివెనుక అంబులెన్సు రెండూ వచ్చి గేటు ముందు ఆగాయి. వాటి మోత విని గేట్‌కీపర్ గబగబ గేట్లు బార్లా తెరిచాడు.

గేట్లు తెరవటం ఆలశ్యం బయటవున్న జనాలు లోపలికి తోసుకుంటూ రాసాగారు. జీప్ ఆగి ఆగగానే దాంట్లోంచి గబుక్కున బయటికి దూకాడు యస్. ఐ. భరద్వాజ్

లోపలికి తోసుకుంటూ వస్తున్న జనాలవంక తీక్షణంగా చూశాడు

ఆ తర్వాత కానిస్టేబుల్స్‌కి స్ట్రిక్ట్ ఆర్డర్ ఇచ్చాడు.

కరెక్టుగా రెండు క్షణాలలో ఆ ఆవరణ మొత్తం నిర్మానుష్యంగా తయారయింది. అంతకు ముందే పరుగులాంటి నడకతో హాల్లోకి వెళ్ళాడు భరద్వాజ.

ఏకలింగం ఎదురొచ్చి తన్ని పరిచయం చేసుకున్నాడు జరిగింది చెప్తూ పైకి తీసుకెళ్ళాడు భరద్వాజని.

కానిస్టేబుల్స్ ఇద్దరు గేట్ దగ్గర నుంచొని బయటివాళ్ళని లోపలికి రానివ్వకుండా లోపలివాళ్ళని బయటికి వెళ్ళకుండా కంట్రోల్ చేస్తున్నారు.

డోర్సు తీసుకుని ఏకలింగం భరద్వాజ, లోపలికి ఎంటర్ అయ్యారు.

(సశేషం)

## మీకు తెలుసా ?

* సోవియట్ రష్యాలోని పదిహేను రిపబ్లిక్‌లలో అయిదింటిలో ముస్లింలే మెజార్టీ.
* గుర్రపు పందేల పోటీలు ఇంగ్లాండ్‌లో ఒకటవ జేమ్స్ పాలనా కాలంలో ( 1603 - 1625 ) నిర్వహించటం మొదలైంది.
* కాంతి వేగాన్ని డేనిష్ ఖగోళ శాస్త్రవేత్త ' ఓల్ రొవుర్ ' తొలిసారిగా కొలిచాడు.
* అమెరికా సోవియట్ యూనియన్‌ల తర్వాత అధిక మొత్తంలో ఆయుధాలను ఎగుమతి చేసే దేశం ఫ్రాన్స్.
* పశ్చిమ ఆసియాలో పర్షియన్ జలసంధి మిక్కిలి వేడిగా వుండే సముద్రం. దాని ఉష్ణోగ్రత 96° ఫారెన్ హీట్.
* 1850 వరకు బూట్లు తిన్నగా వుండి ఏకాలుకైనా ధరించటానికి వీలయ్యేవి ' కుడి ఎడమైతే పొరపాటు లేదోయ్ '. అనుకునేవారికి అవి బాగా సౌకర్యంగా వుండేవి.
* మనం అనుకుంటున్నట్టుగా జీబ్రా వంటిపై వుండేది నల్లచారలు కాదు తెల్లచారలు.
* 1897 జూన్‌లో కలకత్తాలో ప్రపంచంలో తొలి వ్రేలిముద్రల బ్యూరో ఏర్పాటయింది.
* ఇండియాలో బ్రాడ్‌కాస్టింగ్‌ను 1930లో జాతీయం చేసారు. 'ది ఇండియన్ బ్రాడ్‌కాస్టింగ్ సర్వీస్' అన్న పేరుతో పోస్ట్ అండ్ టెలిగ్రాఫ్ డిపార్ట్‌మెంట్ నిర్వహణలో అది పనిచేసేది.
* అన్ని ఆహారధాన్యాలలోకి ఎక్కువ విస్తీర్ణంలో పండించే పంట గోధుమ. ఎక్కువ జనాభా భుజించేదికూడా గోధుమే.
* పొగత్రాగిన మొదటి ప్రజలు 'అమెరికన్ ఇండియన్'లు. అది ఆరోగ్యానికి మంచిదని వారు ఆశించేవారు.



# రక్తతిలకం — డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు

'తివారీ' వంశం వినత పెట్టిన గ్రుడ్డులోంచి
'చంద్రశేఖరశర్మా' సుపర్ణుడు పుట్టి
'ఆజాద్' రెక్కలు విప్పి
స్వాతంత్ర్య సమరాకాశంలోకి ఎగిరాడు.
తన దాస్య విముక్తి అతి చేరువలో వుందని
సంతోషంతో చూసింది కన్నతల్లి !
ఓ స్వేచ్ఛా గరుత్మంతుడా !
నువ్వూ, భగత్సింగూ, సుఖదేవ్, రాజగురూ
ఇంకా ఎందరో యువ కిశోరాల
క్రొన్నెత్తుటి నరాలశక్తి
నా తల్లిగడ్డమీద తరతరాలుగా
సువర్ణ అరుణోదయాలు సృష్టించాలి !
నీ మెలిదిరిగిన మీసాల కొసలు పుక్కిలించే
పౌరుషం
నా జాతి జడత్వంలో అగ్నిపర్వతమై ప్రేలాలి !
నీ పిస్తోలు గొట్టంలోనే
నా దేశ భవిష్యత్తు చిక్కువడింది.
అప్పుడు నువ్వు వదిలిన ప్రాణవాయువే
ఇప్పుడు నేను పీలుస్తూన్న స్వేచ్ఛావాయువు !
ఓహో ఆజాద్ !
నీ త్యాగమయ జీవితం
మా అభ్యుదయ శిఖరాల మీద
వేగుచుక్కగా నవ్వాలి !
నువ్వు చిందించిన నెత్తురు
మా గుండెల్లో
ఎర్రటి జెండాగా ఎగరాలి !
కాని —
నీలాంటి వీరవరుల
రక్త బలిదానాల స్వేచ్ఛా మైదానం మీద
కంత్రీ ప్రజాస్వామ్యపు కుక్కల కాట్లాటలు ...
కల్లు ఓట్ల జిత్తులమారి నక్కల పోట్లాటలు ...
ఈ స్వాతంత్ర్యం
ఎన్ని ప్రాణత్యాగాల కటికి చీకట్లలో
నలిగి నలిగి ఉదయించిందో
తెలియని మూర్ఖుల్ని చూసి
ఈ కవిగాడు
గుండె పగిలి
ఏడుస్తున్నాడు ...
భరతమాత నుదుట
రక్తతిలకంగా వెలిగిన
నీ చరిత్ర విని
పులకిస్తున్నాడు ...

మార్చి 'శ్రీవాణి'లో కొమరగిరిగారు వ్రాసిన ముఖచిత్ర
వ్యాసం చదివి ఉత్తేజాన్ని పొంది వ్రాసిన కవిత )



# ప్రస్తావన

వడలి మందేశ్వరరావు

భారత కథ పాండవ కౌరవుల యుద్ధ కథ అయితే, అది సౌప్తిక ప్రళయంతోనే సమాప్తి నొందింది. ఆ మీద యుద్ధ పర్వాలలో మృతినొందిన వీరుల కగ్ని సంస్కారం చేయడానికి స్త్రీ పర్వం కూడా అవసరమే. యుద్ధానికి ఫలితంగా ధర్మరాజు పట్టాభిషేకము శాంతి పర్వం ప్రథమాశ్వాసంలో కనబడుతుంది. అంతతో కురుపాండవ వీరుల కథ సమాప్తమవుతుంది.

కాగా స్త్రీ పర్వం పాండవ కౌరవ యుద్ధ రూపకానికి చరమాంకం అవుతుంది. ఇందులో ప్రధానంగా రెండు భాగాలున్నాయి మొదటిది నూర్గురు కొడుకులనూ, బంధు మిత్రులందరనూ, పోగొట్టుకున్న ధృతరాష్ట్రునికి సంజయ, విదుర, వ్యాసులు దుఃఖోపశమనం చేయడం. తర్వాత కనవచ్చేది స్త్రీల నిర్భరమైన శోకం. గాంధారికీ, ద్రౌపదికీ కొడుకు లొక్కరూ దక్కలేదు; కుంతీ కొడుకు కర్ణుని చేతులారా చంపుకున్నట్టు కుమిలిపోయింది. వీరు గాక ధృతరాష్ట్రుని కోడండ్రు ఉన్నారు, మృతవీరుల భార్య లున్నారు వీళ్ళందరూ యుద్ధంలో వేర్వేరు శిబిరాలకు చెందిన వారైనా, శోకం వారిని ఒక్క దిక్కుకే చేర్చింది.

స్త్రీ పర్వంలో పాండవ కౌరవుల యుద్ధ కథ ముగింపుకు వస్తే, ఇందులో పాండవ కౌరవ యోధులు కథ నుండి ఉపసంహరింపబడడం కూడా కనవడాలి. యుద్ధ పర్వాలలో ఒక్కొక్క యోధుడూ యుద్ధం చేస్తూనే నేల కొరుగుతాడు. ప్రధానమైన భీష్మ, ద్రోణ, కర్ణ, శల్యుల మృతికీ, దుర్యోధన దుశ్శాసనుల మృతికీ, ధృతరాష్ట్రుని విలాపం మనం ఆ యా పర్వాల ఆరంభంలో విన్నాము. కాని ఇంకా అనేకమంది భారత వీరులు యుద్ధభూమిలో నేల కొరిగిపోయారు. వీరందరికీ కడపటి వీడ్కోలు స్త్రీ పర్వంలోనే కనబడుతుంది.

భారత కథయొక్క పరమార్థం కూడా స్త్రీ పర్వంలోనే కనబడుతుంది. ప్రపంచంలో అనేక తత్త్వవేత్తలు, ద్రష్టలు తిరిగి తిరిగి చెప్పే మాట యుద్ధంలో గెలుపు అనేది ఉండనే ఉండదని. పోరిన రెండు పక్షాలూ పొందేవి ఓటమే. అందరూ పంచుకొనేది దుఃఖమే; అందరి కళ్ళబడేది నాశనమే. రామాయణ కథలో దుష్టుల సంహారం జరిగింది; మంచివాళ్లు అందరూ బ్రతికే ఉన్నారు. అది హర్షించదగ్గదే. కాని లోకంలో అలా జరగదు. యుద్ధం మంచినీ, చెడ్డనూ కూడా తుడిచిపెట్టి వేస్తుంది.

భారత యుద్ధంలో జరిగింది అదే. పదునెనిమిది అక్షౌహిణుల సైన్యం యుద్ధంలో పాల్గొన్నది. ధర్మం జయించింది అన్న తృప్తి కలిగింది; పాండవులను జయం వరించింది. అయితే చావగా మిగిలినవారు పాండవులు, శ్రీకృష్ణుడు, సాత్యకి, మాత్రమే కనబడతారు. ఆమాత్రంమంది కౌరవుల పక్షాన పోరినవారూ బ్రతికి ఉన్నారు – అశ్వత్థామ, కృపాచార్యులు, కృతవర్మ ! ఇక గెలుపు ఎవరిదయినట్టు !

ఇంతటి భయంకరమైన సత్యాన్ని మనకు బోధించేది మహాభారత కథ. అందులో దీనిని మరీ ప్రత్యక్ష మొనరించేది స్త్రీ పర్వం.

గదా యుద్ధంలో తొడలు విరిగి, దిక్కులేక, నేలమీద పడిఉన్నాడు దుర్యోధనుడు ! ఇంకా ప్రాణం పోలేదు. భయంకరమైన పెనుగాలికి నేల గూలిన మహనీయ సాల వృక్షములా, ప్రబలమైన కిరాతుని మార్గణములచేత త్రుళ్ళిన భద్రగజములా, కల్పాంతమందలి మహాగ్ని వల్ల ఇంకిపోయిన మహాసముద్రంలా, కాల పర్యయమున తూలి నేలను రాలిన నిండు పున్నమ చంద్రునిలా, ఉన్నాడా నేలను కూలిన రారాజు. ఆయనను చూచేసరికి కృపః

# నిత్య సత్యాలు

అనుభవములేని ప్రచారము నిరర్థకము.
విమర్శన లేనిదే వివేకోదయముండదు.
మాట్లాడటం తేలిక; పనిచేయడం కష్టం.
నడమంతరపు సిరి నరాలమీద పుండులాంటిది.
నోరు మంచిదయితే ఊరు మంచిదవుతుంది.
హీనస్థితిలో నున్న మానవుడికి అన్నీ దుర్బుద్ధులే పుట్టుతూవుంటాయి. అట్టి స్థితిలో కూడా ఉన్నత భావాలను విడనాడని వ్యక్తే నిజంగా ధైర్యశాలి.
ఆత్మస్తుతి, పరనింద పనికిరాదు.
సుఖాన్నెలా స్వీకరిస్తామో, అదేవిధంగా దుఃఖాన్ని కూడా స్వీకరించడం నేర్చుకోవాలి.
దీర్ఘకాలం జీవించడం కాదు, వీరోచితంగా జీవియాత్ర గడపడం ముఖ్యం.
దుర్జనులు నిందాపవాదంబులచే సజ్జనులను బాధించుచుందురు.
సోమరిపోతులను అదృష్టము వరించదు. ధైర్య సాహసులైన శ్రామికులను మాత్రమే వరిసుంది.

కృతవర్మ, అశ్వత్థామలకు దుఃఖము పట్టరానిదయింది. అందులో అశ్వత్థామకు దుర్యోధనుడు మరీ మిత్రుడు. తన తండ్రిని-ద్రోణాచార్యుని - దృష్టద్యుమ్నుడు అన్యాయంగా చంపాడు; ఇప్పుడు మిత్రుడు దుర్యోధనుడు కూడా అధర్మ యుద్ధలో నేల కూలి ఉన్నాడు. పైగా అతని తలను భీముడు తన్నుతాడా! కోపంతో కుతకుతలాడి పోయాడు గురు పుత్రుడు; దృఢ నిశ్చయుడయాడు. దుర్యోధనునితో ఇలా అన్నాడు :

" పాండవు లట్లు మజ్జనకుఁ బాప విధిం దెగఁ
జూచి నప్పుడుం
బండ తర ప్రకోపము నసహ్యపు శోకము నిట్టు
చిత మెుం
డొండఁ గలంప వే నిపుడ యెుక్కఁడుఁ దక్కఁక
యుండ వారి ను
ద్దండ మదప్రవహ్నిఁ బరి దగ్ధులఁ జేయక
యెట్టు లుండుదున్

" వినుము సత్యంబు పల్కెద మనుజనాథ
యద్దరి యందఱఁ బాంచాలు రాది గాఁగఁ
గలుగు బాంధవ మిత్ర సంఘముల తోడఁ
గూడ నేఁ డిదె కృష్ణుండు సూడఁ ద్రుంతు. "
- శల్య : 2-411, 412

అశ్వత్థామ చెప్పినంతపనీ చేశాడు. ఆ రాత్రికి రాత్రి శివుని ప్రత్యక్ష మొనరించుకొని, ఆయన ప్రసాదించిన " అనపాయ బలోద్భత శౌర్య సంపద " వల్ల (సౌప్తిక 2-107) పాండవ శిబిరంలోని దృష్టద్యుమ్నుని, శిఖండిని, ఇతర పాంచాలురను, ఇంకా మిగిలి ఉన్న మాత్స్య ప్రభద్రక ప్రభృతి బలాలను, ఉపపాండవులను, కరి తురగాలను - నిరవశేషంగా నిశాసమయంలో సంహరించాడు. అతడు పాండవ శిబిరంలో ప్రవేశించేసరికి అందరూ నిద్రాసక్తులై ఉండడంవల్ల నిశ్శబ్దంగా ఉన్నది. అతడు వారిని తెగనరుకుతోంటే శిబిరమంతా హాహాకారాలతో నిండిపోయింది. ఇప్పుడు మళ్ళీ -

" పాండవ శిబిరంబు నిరవశేషంబుగా సమయించి
శమియించి చాపాచార్య నందనుండు మే నెత్తుట
జొత్తిల్లి మోహాంధ్యంబుతో, గలసి యునికిం జేసి,
సాంద్రతర రక్తసిక్తంబులైన బాహు ఖడ్గంబు లేక
ద్రవ్యంబు చందంబు నొంద మరలి తాను బ్రవేశించు
తఱి నెట్లుండె నట్ల నిశ్శబ్దంబై యవ్విడిదల పెడలు
చుండఁ దెలతెలవేగె ! " (సౌప్తిక : 1-202)

ఈ సౌప్తిక ప్రళయాన్నుంచి తప్పించుకొన్నవారు శ్రీకృష్ణుడు, సాత్యకి, పాండవులు మాత్రమే ! మిగతా వారందరినీ తన సఖుడు అశ్వత్థామ సమయించాడని విన్న దుర్యోధనుడు తృప్తిగా ప్రాణాలను విడిచాడు.

ఇక్కడనుంచి ప్రారంభమవుతుంది స్త్రీ పర్వంలోని కథ !



# అచంచల విశ్వాసము

డా॥ చేబోలు చిన్మయబ్రహ్మరవి

ఎడారి వంటి యీ ప్రపంచమున మానవులు మృగములవలె సంచరించుచుఁ గుమారులు, మిత్రులు, బంధుగులు నాకుపకృతి చేయుదురనుకొని భ్రాంతి పడి చిట్టచివఱకెవ్వరును తన పరిస్థితినే పట్టించుకొనలేదని గ్రహించిన తర్వాత ఏడ్చుటకన్న చేయఁగలిగిన దేముండును ? ఏడ్చి ఏడ్చి మృగతృష్ణ వలన మరణించెడు మృగమువలె మనమును కనుమూయక తప్పదు.

పూర్వకర్మ ఫలములను బట్టి ప్రాప్తాప్రాప్తములుండునని తెలిసికొనిన తరువాత భగవంతుఁడు మనకిది యీయలేదు., అది యీయలేదని అనుకొనము. జీవితమంతయు కర్త సూత్రానుసారముగా సాగిపోవుచున్నదని గమనించిన వారు విశ్వమునకు జీవితమున కధినేతయగు పరమేశ్వరునే ఆశ్రయించవలసి యున్నది.

ధన ధాన్యములున్నను లేకపోయినను పరిస్థితులు బాగున్నను, బాగుగా లేకపోయినను, జీవ బంధువులు సన్నిహితులుగా నున్నను లేకపోయినను మనము చలింపక, జీవితస్వామిని పొందుటయే ప్రధాన లక్ష్యముగా జీవింపవలసియున్నది.

సంపూర్ణముగాఁ దనపై నాధారపడిన భార్య కష్టసుఖములు సమస్తము భర్త చూచునట్లే మనో బుద్ధులను సమర్పించి తదర్పితముగా జీవించు వారి యోగక్షేమములను జగన్నాధుఁడు చూచి తీరును.

“ విహాయ కామాన్యస్సర్వాన్
పుమాంశ్చరతి నిస్ప్రృహః
నిర్మమో నిరహఙ్కార
సశాన్తి మధిగచ్ఛతి

గీత – సాంఖ్యయోగము 71 శ్లో.

కోరికలను విడచి సమగ్రముగా స్వామిపై ఆధారపడినపుడు మమకారము, అహంకారము నశించును. నా ప్రభువు నన్ను రక్షించి తీరునని ధృఢ విశ్వాసమేర్పడును. తస్మాలముగా అతఁడు నిజమైన శాంతిశ్రీని బొందుచున్నాడని భావము.

“ తేషా మహం సముద్ధర్తా
మృత్యు సంసార సాగరాత్
భవామి నచిరాత్పార్థ
మయ్యావేశిత చేతసామ్ ”

గీత – భక్తియోగము 7 శ్లో.

మృత్యువుతోఁ గూడిన సంసార జీవితమును సాగించుచున్నవారయినను, నా యందు మనస్సుంచఁగల్గిన యెడల అర్జునా ! ! అట్టివారిని నేను శీఘ్రముగా సముద్ధరించెదను ఈ మాటలు గీతాచార్యుని అభయ వాక్యములు. వీని విషయమై యే మాత్రమనుమానించవలసినది లేదు.

ఎటువంటి జీవితములోఁ దానున్నను జీవితేశ్వరుఁడు ఆ స్వామియను ప్రగాఢ భావన హృదయమున స్థిరపడినపుడు – భుజించుచున్నను, నిద్రించుచున్నను, విహరించుచున్నను వారి మనస్సరోజము శ్రీహరి క్రీడా రంగముగానే యుండును. తస్మాలముగా ఆ మహానుభావుని కృపామృత దృష్టి మనలను తడిపివేయును. దానితో జన్మ జన్మల దుష్కృత్య దుర్గంధము లంతరించిపోవును. భక్తి ప్రేమలను గంధములు వెల్లివిరియును. ఇట్టి భావములు ఉత్తమ భాగవతుల దినచర్యలను చూచినపుడు, ఉత్తమ గ్రంధములను పఠించినపుడు హృదయమున నెలకొనును. ఈశ్వరానుగ్రహమందఁగోరెడువారు బాహ్యాడంబరముల జోలికి పోక అంతరంగిక భావనలతో హృదయేశ్వరునకు సన్నిహితులుగా నుండుటకు ప్రయత్నించవలెను. అచంచలమగు విశ్వాసము సాధకులకు లేనిదే యే యోగమైనను, సాధనమైనను సఫలీకృతము కాఁజాలదు. 

# పిడుగులు (కథ)

రావినూతల సువర్ణాకన్నన్

మధ్యాహ్నం రెండు గంటలు కావస్తోంది. చైత్రమాసపు ఎండలు అప్పుడే తమ ప్రతాపాన్ని చూపిస్తున్నాయి.

భోంచేసి నడుం వాల్చిన నేను వీధి తలుపు ఎవరో బాదడంతో తృళ్ళిపడి లేచాను.

"ఇంత ఎండలో ఎవరొచ్చారబ్బా" అనుకుంటూ తలుపు తీద్దునుకదా గుమ్మంలో మా తమ్ముడి కూతురు రమ !

"ఏవిఁటే ఇంత ఎండలో వచ్చావ్ ?" .... అంటూ దాన్ని లోపలికి తీసుకొచ్చి కూర్చోపెట్టాను.

అది మాట్లాడలేదు. కళ్ళలో ఏదో కంగారు స్పష్టంగా కనిపిస్తోంది – ఏదో చెప్పాలని ఆరాటపడుతోంది.

"ఏమ్మా ! ఏవఁయింది ? " అన్నాను నేనూ కాస్త కంగారు పడుతూ.

"అత్తా ! .... అక్కయ్య .... అన్నయ్య ...." మెల్లగా గొణిగింది రమ.

"ఏవఁయిందే వాళ్ళకి !" దాన్ని కుదిపేస్తూ అడిగాను.

"ఏమో ! తెలియదు. ఇద్దరూ .... పడిపోయారు. ఎంత పిల్చినా పలకడం లేదు" బావురుమంది రమ.

నా కాళ్ళు వణికిపోయాయి. మా అత్తగారికి చెప్పి గబగబ పక్క వీధిలో వున్న మా తమ్ముడి ఇంటికి బయల్దేరాను.

మా తమ్ముడికి ముగ్గురు పిల్లలు. ఇద్దరు ఆడపిల్లలు. ఒక మగపిల్లాడు మగపిల్లాడు పెద్దవాడు అరుణ్, రాధిక రెండోది, రమ ఆఖరిది. ముగురూ ముగ్గురే పిడుగులు – వాళ్ళ అల్లరికి ఆ వీధిలో వాళ్ళే కాదు, తెలిసిన వాళ్ళంతా హడలిపోతారు. మా మరదలికి వాళ్ళని దారికి తేవడం ఓ సమస్య అయి కూర్చుంది.

పది రోజుల క్రితం మా తమ్ముడు, మరదలు యాత్రలకని బయల్దేరి వెళ్ళారు. ఇవాళో రేపో వచ్చేస్తారు కూడా. వాళ్ళొచ్చేదాకా ముగ్గురు పిల్లల్నీ మా ఇంట్లో వుండమని బతిమాలినా వుండలేదు ఏవేవో వంకలు పెట్టి.

రాధిక మా ఇంటి కోడలు కాబోతోంది. అందుకే కాస్త సిగ్గుపడుతోందనుకున్నాను. రోజూ వెళ్ళి ఒకటి రెండుసార్లు చూసొస్తున్నాను. ఇంతలో ఏవఁయిందో అర్థం కాలేదు.

ఎలాగో కంగారుగా అక్కడికి చేరుకునేసరికి ఇంటి నిండా జనం మూగారు.

ఇరుగు పొరుగు వాళ్ళు, మా వాళ్ళింట్లో అద్దెకున్న వాళ్ళు.

జనాన్ని తోసుకుని లోపలికెళ్లాను.

అంతే ! కొయ్యబారిపోయాను.

హాల్లోని సోఫాలో రాధిక, కింద కార్పెట్ మీద అరుణ్ అడ్డదిడ్డంగా పడున్నారు స్పృహ తప్పి. లోపలికి అడుగు పెట్టగానే ఒక విధమైన ఘాటు వాసన వచ్చి కడుపంతా దేవేసినట్టయింది.

"ఏం జరిగిందే రమా ! .... రిజల్ట్సేమయినా వచ్చాయా ?" కింద కూలబడి రాధికని చేతుల్లోకి తీసు

కుంటూ అన్నాను. రమ మాట్లాడలేదు. గౌనుతో కళ్లు తుడుచుకుంది.

" రాధీ! .... " దుఃఖం నిండిన గొంతుతో పిల్చాను. ఒకటికి రెండు సార్లు పిల్చాక రాధిక మెల్లగా కళ్ళు తెరిచింది.

" అమ్మా రాధి! ఏమైందమ్మా! " అన్నాను.

రాధిక ఓ సారి నా కళ్ళలోకి చూసి. మళ్లీ భారంగా కళ్ళు మూసేసింది. ఆ చూపులో కూడా నిలకడలేదు. అరుణ్‌ని కూడా పిల్చాను. వాడూ అదే స్థితిలో వున్నాడు.

" డాక్టర్‌కి ఫోన్ చేశారా? " అన్నాను అక్కడ మూగిన వాళ్లతో.

" ఎందుకూ? " దీర్ఘం తీసింది ఛాయాదేవిలాంటి ఓ స్థూలకాయం. ఆమె నిరసనకి తెల్లబోయాను.

" ఎందుకేవిఁటి ఓ మూల పిల్లలిద్దరూ ఆ విధాన స్పృహ లేకుండా పడుంటే ఇంతమంది వుండి డాక్టర్‌ని పిలవకుండా వేడుక చూస్తున్నారా? " కోపంగా అన్నాను.

" అయ్యో! ఎంత పిచ్చివారు శారదమ్మగారూ! అసలు వాళ్ళెందుకలా పడున్నారో తెలుసా? " రహస్యంగా అంది ఔట్‌హౌస్‌లో వుండే అనసూయమ్మ చేతులు, తలా తిప్పుతూ.

ఆవిడకి పిల్లలంటే తగని చిరాకు. కారణం వీళ్ళు ముగ్గురూ ఆవిడని తరచు ఆట పట్టిస్తూంటారు.

" ఎందుకు పడుంటే మాత్రం .... ఇద్దరికీ స్పృహ లేదు. తల్లితండ్రి వూళ్ళో లేరు .... మీరు మాత్రం ఓ సినిమాలా చూస్తున్నారు! ఛ! " అంటూ కోపంగా ఫోన్ కేసి నడిచాను. డాక్టర్‌కి ఫోన్ చెయ్యడానికి.

" అత్తా! ఫోన్ చెయ్యొద్దు! " కంగారుగా అంది రమ.

" అదేవిఁటే? " తెల్లబోయాను దాని మాటలకి. రమ మాట్లాడకుండా వేలితో ఓ మూలగా వున్న టేబిల్ కేసి చూపించింది.

## ప్రశ్నలు-సమాధానాలు

1. ఇండియాలో ఏ కేంద్రపాలిత ప్రాంతానికి స్వంతంగా హైకోర్టు ఉన్నది?
2. మన దేశానికి అధిక సంఖ్యలో ఆదాయం వచ్చే శాఖ ఏది?
3. "షేక్స్పియర్ ఆఫ్ ఇండియా" ఎవరు?
4. మన దేశంలో న్యూక్లియర్ ఫ్యూయెల్ కాంప్లెక్స్ ఎక్కడ ఉన్నది?
5. "వన్యమృగ వారము" గా మన దేశం ఏ వారాన్ని పాటిస్తున్నది?
6 NCC ఎప్పుడు స్థాపించబడినది?
7. లోక్‌సభలో అత్యధిక స్థానాలు కలిగిన రాష్ట్రమేది?
8. "స్విమ్మింగ్ సిటీ" గా పేరుగాంచిన నగరమేది?
9. "బ్లాక్ పగోడా" అనే సూర్యదేవాలయం ఎక్కడ ఉంది?
10. గ్రుడ్డితనం ఏ విటమిన్ లోపంవల్ల సంభవిస్తుంది?
11. "మెట్రాలజీ" ఏ శాఖకు సంబంధించిన శాస్త్రం?
12. రష్యా విప్లవ మెప్పుడు జరిగింది?

1. ఢిల్లీ 2. కస్టమ్స్ డ్యూటీ 3. కాళిదాసు
4. హైదరాబాద్ 5. అక్టోబర్ మొదటి వారము
6. 1948లో 7. ఉత్తరప్రదేశ్ 8. బ్యాంకాక్
9. కోణార్క 10. విటమిన్ ఎ 11. బరువులు
కొలతలకు సంబంధించినది 12. 1917 లో

నాకు తల తిరిగిపోయింది.

ఆ ఘాటయిన వాసన దేనిదో గ్రహించేశాను.

ఆ టేబిల్ మీద రెండు బ్రాందీ సీసాలు వున్నాయి. ఒకటి ఖాళీగానూ, మరొకటి సగానికి వున్నాయి. పక్కనే చిప్స్, జీడిపప్పు వగైరాలున్నాయి. కింద రెండు సోడా బాటిల్స్ ఖాళీగా వున్నాయి.

పరిస్థితి అర్థమయింది నాకు.

" ఛ ! ఛ ! వీళ్ళు అల్లరి పిల్లలే అనుకున్నాను గానీ ఇలా .... తాగి .... ఓహ్ .... !" నాకు తల కొట్టేసినట్టయింది. అందరూ నాకేసి హేళనగా చూస్తున్నట్లనిపించింది.

" ప్లీజ్ ! మీరంతా బైటకెళ్ళిపొండి " అన్నాను కాస్త కఠినంగా. వాళ్ళందరూ వెను తిరుగుతుంటే-

" ఆంటీ ! మీరెవ్వరూ వెళ్ళద్దు ! .... నాకేదో భయంగా వుంది ! " అంటూ వాళ్ళందర్నీ కూర్చోబెట్టింది రమ. దాని చర్య నాకు చిరాకుని కలిగించినా అతి బలవంతాన ఆ చిరాకుని అణిచేసుకుని, నేనూ, మరొకామె కలిసి బలవంతంగా రాధికని లేవదీసి కూర్చోపెట్టాం.

అది మెల్లగా కళ్ళు తెరచి ఏదో పిచ్చివాగుడు మొదలు పెట్టింది. మాట అర్థం అయీ కానట్టుంది.

" ఇదేం పొయ్యేకాలమే నీకు .... ఆడ పుటక పుట్టి .... బ్రాందీలు, విస్కీలూ తెచ్చి తాగుతారా .... ఎంత పెద్దవాళ్లు ఇంట్లో లేకపోతే మాత్రం .... ఇంత అన్యాయమా ! " గొణుక్కుంటూనే కాసిని మజ్జిగ తెచ్చి దానిచేత తాగించాను. మజ్జిగ తాగేసి మళ్ళీ అచేతనంగా పడిపోయింది రాధిక.

" అరుణ్ ఏమిట్రా ఇదంతా ! .... అసలీ అలవాటు ఎప్పుడయిందిరా ! అవ్వ ! .... ఎంత అల్లరివాళ్ళైతే మాత్రం ఇలా తాగి తందనాలాడి పరువు బజార్న పెడతారా ? " అంటూ వాణ్ణి లేవదియ్యబోయాను. కానీ వాడు చెట్టంత మనిషి ! వాణ్ణి లేవదియ్యడం మా వల్ల కాలేదు.

" నాయనా ! అరుణ్ ! " అనసూయ అత్తగారు తట్టిందోసారి. వాడు కళ్లు తెరచి, ఆవిణ్ణి చూసి –

" హాయ్ డాళింగ్ " అన్నాడు ముద్దగా.

ఆవిడ బిత్తరపోయింది.

మరుక్షణం రన్నింగ్ రేసులా బైటికి పరిగెత్తింది.

ఏం చెయ్యాలో తోచలేదు నాకు.

ఇంతలో మా అబ్బాయి రమణ రావడంతో నాక్కాస్త వూపిరి అందింది.

వాడు డాక్టర్.

" ఏమైందమ్మా ? .... " అన్నాడు ఆదుర్దాగా.

నేను సంగతంతా వివరించాను.

రమణ నిర్ఘాంతపోయాడు ఓ క్షణం.

తర్వాత మెల్లగా వాళ్ల దగ్గరికెళ్ళి కుదిపి చూశాడు. ఎవరూ పలికే సితిలో లేరు.

పల్సు, కళ్ళు చూసి ఆలోచనలో పడిపోయాడు. వాడి మౌనం నాకు కంగారనిపించింది.

" ఏమిట్రా ? " అన్నాను భయంగా.

వాడు మాట్లాడలేదు. మొహం మాత్రం గంభీరంగా అయిపోయింది –

" హాస్పటల్లో చేరుద్దామా ? " అన్నాను.

" లాభం లేదు ! "

" అంటే ? .... " నాకు ఒణుకొచ్చేస్తోంది.

" వీళ్లందరూ బాగా తాగేశారు అలవాటు లేకుండా అంతలా తాగేసరికి ఇలా తయారయ్యారు – నాడి కూడా బలహీనంగా వుంది .... "

" ఏమిట్రా నువ్వనేది ?" బావురుమన్నాను.

" వీళ్ళకేం పరవాలేదమ్మా ! .... కానీ .... మరో దుర్వార్త .... "

" దుర్వార్తా ? .... త్రుళ్ళిపడ్డాను.

రమ కంగారుగా చూసింది.

అక్కడున్నవాళ్ళంతా కుతూహలంగానూ, ఆత్రుత గానూ చూశారు.

" అవునమ్మా ! ఓ దారుణమైన సంఘటన జరిగి పోయింది ! "

" ఏమిటో చెప్పరా ! " వాణ్ణి గుంజేస్తూ అన్నాను.

" అదే .... అత్తయ్య మావయ్య .... "

" ఆఁ ! అత్తయ్య మావయ్యా ? .... త్వరగా చెప్పరా " నాకు నిస్సత్తువ ఆవహించేస్తోంది.

" అత్తయ్య, మావయ్య వస్తున్న కారుకి యాక్సిడెంట్ అయిందట. ఇద్దరికీ సీరియస్‌గా వుందని టెలిగ్రాం వస్తే నేను ఇంటికొచ్చాను. తీరా వెళ్తే నువ్వు లేవు. అందుకే ఇలా వచ్చాను. కానీ ఈ పరిస్థితుల్లో .... " పాలిపోయిన మొహంతో అన్నాడు రమణ.

నేను కుప్పకూలిపోయాను.

రమ పెద్దగా ఏడుపు మొదలుపెట్టింది.

మిగతావాళ్ళంతా భయంతోనూ, బాధతోనూ గుసగుసలు ప్రారంభించారు.

అందరం ఆ అవస్థలో వుండగానే ఓ చిత్రం జరిగి పోయింది -

అరుణ్, రాధిక ఒక్క వుదుటని లేచి రమణని పట్టి గుంజేసూ -

" బావా ! - అమ్మా నాన్నలకేమైంది ? " అన్నారు ఏడుస్తూనే.

" ఏక్సిడెంట్ ! "

" ఇప్పుడెక్కడున్నారు ? " అంది రాధిక ఏడుస్తూనే.

"హాస్పటల్లో!....పరిస్థితి ప్రమాదకరంగా వుంది" విచారంగా అన్నాడు రమణ.

" పద బావా ! వెళ్దాం" రమణ చెయ్యి పట్టుకుని లాగాడు అరుణ్.

"మీరా ! ఈ పరిస్థితిలోనా ! నో ! నో ! మిమ్మల్నిలా చూస్తే వాళ్ళకి మరింత ప్రమాదం" గంభీరంగా అన్నాడు రమణ.

"అది కాదు బావా !....మరి....మీరే"

## విజ్ఞానం

- ప్రతి సంవత్సరం 20,000 మంది అమెరికన్లు నోటి కేన్సర్‌కు గురవుతున్నారు. వారిలో దాదాపు 8000 మందికి మరణం ప్రాప్తిస్తున్నట్లు అంచనా.
- లవంగాల పుట్టుక ఈస్టిండియా ఆర్చి పిలేగోలోని స్పయిన్ దీవులనబడే మోలుక్కాస్.
- చైనా దేశంలో లవంగాలు క్రీ. పూ. 300 నుంచి వాడుకలో ఉన్నట్లు తెలుస్తుంది.
- పొగాకు మొట్టమొదటగా యూరప్ దేశానికి 16 వ శతాబ్దంలో పరిచయమైనది.
- ప్రపంచ వ్యాప్తంగా జరిపిన పరిశోధనలలో పొగ త్రాగడం వలన ఊపిరితిత్తుల కేన్సర్ వస్తుందని నిర్ధారణ చేయబడింది.
- ప్రతి ఉదయం నిద్ర లేచిన వెంటనే ఒక గ్లాసు చల్లని నీరు త్రాగినచో చక్కగా కాల విరేచన మగును. మరియు వాత, పిత్త, కఫ దోషాదులు హరించి ఆరోగ్యంగా ఉందురు.
- నెమ్మదిగా చక్కగా నమలుతూ చేసే భోజనం త్వరగా జీర్ణానికొస్తుంది.
- స్థూలకాయులు, వాతరోగులు, దుర్బల దేహులు వేడి నీటి స్నానము చేయుట మంచిది.

— యస్. యన్.

"ఏమిటి! తాగిన మైకం వదిలిపోయిందంటారా?"

"అది కాదు బావా ! .... మేమిద్దరం సరదాగా.... " రాధిక మాట తడబడింది.

"ఏమిటి సరదాగా తాగారా!" వ్యంగ్యంగా అన్నాడు రమణ.

"వట్టిది బావా! వాళ్ళు నిజంగా తాగలేదు. స్పిరిట్ తెచ్చి ఇల్లంతా పోశారు. దేవకీ వాళ్ళన్నయ్య తాగుతాడు కదా....అతన్నడిగి ఈ బాటిల్స్ తెచ్చాం. కాస్త బ్రాందీ మొహానికీ, బట్టలకీ రాసుకుని పడిపోయినట్టు నటించారు!" ఏడుస్తూ చెప్పింది రమ.

"ఎందుకు !" తెల్లబోతూ అన్నాడు రమణ.

"అందర్నీ ఫూల్స్ చేద్దామని !"

"మై గాడ్ !"

"సారీ బావా! అమ్మావాళ్ళకెలా వుంది?" దీనంగా అడిగాడు అరుణ్.

"ఏమిటి తల్లీ! ఇదంతా!" అన్నాడు రమణ.

"నిజమే బావా ! ఇవాళ ఏప్రిల్ ఫస్ట్ కదా.... అందుకే ఎప్పటిలా కాకుండా బ్రహ్మాండంగా నటించి అందర్నీ ఫూల్స్ చేద్దామనుకున్నాం....కానీ–" అంది రాధిక.

"అవును బావా!....ఇలా చెయ్యాలని నెల్లాళ్ళనించీ ప్లాన్ వేసుకున్నాం. ఇప్పుడు అమ్మావాళ్ళు కూడా వూళ్ళో లేరు కదా....అందుకే ధైర్యంగా చేశాం. తొందరగా పద బావా ! అమ్మావాళ్ళని చూడాలి" అంది రమ కళ్ళు తుడుచుకుంటూ.

పక్కున నవ్వాడు రమణ.

నేను అయోమయంగా చూశాను

"నేను కూడా అందర్నీ ఫూల్స్ చేశాను అనుకోకుండా !" అన్నాడు రమణ నవ్వుతూనే.

"అంటే ?"

"అక్కా, బావలకేం అవలేదు. వాళ్ళిద్దరూ యాత్రలు ముగించుకుని క్షేమంగా వచ్చేశారు. వాళ్ళని ఆపి బామ్మ కాఫీ అదీ ఇస్తోంది. రమ వచ్చి నిన్ను కంగారుగా తీసికెళ్ళిందని తెలిసి నేను పరిగెత్తుకొచ్చాను అక్కావాళ్ళకీ విషయం తెలియనివ్వకుండా.

అంతే ఇక్కడ సీన్ చూసి విభ్రాంతపోయాను. వాళ్ళిద్దర్నీ ఎగ్జామిన్ చేసి చూశాను. నార్మల్‌గా వున్నారు. వాళ్ళ విషయం పూర్తిగా అర్థమయింది. అంతే! సరదాగా నేనూ ఓ సీన్ క్రియేట్ చేశాను!" నవ్వాడు రమణ.

అందరం తేలిగ్గా వూపిరి తీసుకున్నాం.

అరుణ్, రాధిక సిగ్గుతో తలలు దించుకున్నారు.

"ఇంతకీ ఫూలయింది ఎవరు ?" అన్నారు చుట్టుపక్కవాళ్ళుకూడా తేలిగ్గా నవ్వేస్తూ.

"వీళ్ళే" అరుణ్, రాధికల కేసి చూస్తూ అన్నాడు రమణ.

"కాదు ! అందరం ఫూల్స్ అయ్యాం" తడి ఆరని కళ్ళతో అంది రమ.

"అందరం ఫూల్స్ అయ్యాం ! ఒకసారి కాదు ! రెండు సార్లు!" అనసూయ అత్తగారు బోసి నోటితో నవ్వుతూ అంది.

"మీరెవ్వరూ కాదర్రా! ఇలాంటి పిడుగుల్ని కన్నారు చూడండి వీళ్ళిద్దరూ ఫూల్స్!" అప్పుడే మా తమ్ముడు, మరదలితో రంగప్రవేశం చేసిన మా అత్తగారు అన్నారు ముసిముసిగా నవ్వుతూ.

అందరూ పక్కున నవ్వారు.

పిల్లలు ముగ్గురూ తల్లిదండ్రులని చుట్టేశారు పసివాళ్ళలా.

"ఇంక లాభంలేదు మరదలుపిల్లా! ఇంక ఈ పిల్లకి ముక్కుతాడు వెయ్యాల్సిందే!" రాధికకేసి మురిపెంగా చూస్తూ అన్నాను.

"అయ్యబాబోయ్! ఈ తాగుబోతుపిల్ల నాకొద్దు బాబూ! రోజుకో బాటిల్ తెమ్మంటే నేనెలా తెచ్చేది !" భయం నటించాడు రమణ.

అందరూ మరోకసారి పకపకలాడారు.

రాధిక మొహం అరుణిమ దాల్చింది.

"ఇంకెప్పుడూ ఇలాంటి అల్లరి చెయ్యం బావా ! అమ్మో....నిజంగా అమ్మ వాళ్ళకేదో అయిపోయిందని ఎంత భయం వేసిందో!" అన్నాడు అరుణ్.

"సరి! సరి! ముందు ప్రయాణం చేసి వచ్చినవాళ్ళు కాస్త విశ్రాంతి తీసుకోనివ్వండి. పెళ్ళివిషయాలూ అవీ మళ్ళీ మాట్లాడుకోవచ్చు" అంది అనసూయ అత్తగారు.

అందరూ నవ్వుకుంటూ కదిలారు.

రాధిక సిగ్గుతో కందిపోయిన చెంపల్ని, వాలిపోయిన కళ్ళనీ చూస్తూ తన్మయత్వంలో పడిపోయాడు మా రమణ. ★

# ఆత్మ స్వరూపం (ఛాందోగ్యోపనిషత్తు)

ఒకానొక కాలంలో, బ్రహ్మజ్ఞానులైనవారు ఆత్మ తత్త్వాన్ని గురించి ఇలా నిర్వచించారు –

"నిష్కళంకమైనది ఆత్మ. ఆకలి దప్పులూ, దుఃఖాలూ ఏవీ ఆత్మను బాధించలేవు. అది జరామరణాలకున్నూ అతీతమైనది. సత్య దర్శనం కోరుకునే మనిషి-ఇట్టి ఆత్మ స్వరూపాన్ని తెలుసుకొనే ప్రయత్నం చేయాలి. ఈ అన్వేషణ సఫలం కావడమంటే అతడు ఆత్మానుభవం పొందడమే : ఇప్పుడతడు సర్వలోకాలలో ఉన్న ఆత్మ స్వరూపాన్నే పొందుతాడు కనుక – అతనికి కోరికలే లేని ఉత్తమ స్థితి లభిస్తుంది."

ఈ విషయాన్ని దేవతలూ, అసురులూ – కర్ణాకర్ణిగా విన్నారు. ఈ ఆత్మ తత్త్వమేమిటో తెలుసుకు తీరాలనే వాంఛ వారిరువురికీ కలిగింది.

దేవతల తరపున ఇంద్రుడూ, రాక్షసులకు ప్రతినిధిగా విలోచనుడూ – ఇద్దరూ ప్రజాపతి వద్దకు వెళ్ళారు. ఒకటా, రెండా – ముప్పై రెండు సంవత్సరాలపాటు శుశ్రూష చేశారు.

అప్పటికి ప్రజాపతికి వారిపైన దయ కలిగింది.

"ఎందుకువచ్చారిక్కడికి ! ఏమి కోరి మీరు ఇంత కాలము ఇక్కడ ఉన్నారు ? ...." అని ప్రశ్నించాడు.

"స్వామీ ! అన్ని కోరికలనూ జయించ గలిగినదీ – సర్వ ప్రపంచాన్నీ ఇవ్వగలిగినదీ అయిన ఆత్మ జ్ఞానం కోరి వచ్చిన శిష్యులం. ఉపదేశం చేసి అనుగ్రహించండి." .... అన్నారు వారు.

ప్రజాపతి వారికి చిన్న ఉపదేశం చేశాడు. "మనిషి కనుపాపలలో కనిపించేది ఆత్మ. అభయం, అమరం – ఆ ఆత్మ, అదే బ్రహ్మం అని తెలుసుకోనండి."

శిష్యులకు ఒక సందేహం – "స్వామీ ! జలంలోనూ అద్దంలోనూ కూడ కనిపించే ప్రతిబింబాలలో ఏది సత్యమైన ఆత్మస్వరూపం" అని ప్రశ్నించారు.

ప్రజాపతి చిరునవ్వుతో అన్నాడు – "కళ్ళలో, నీళ్ళలో, అద్దంలోనూ మీకు కనిపించేదే ఆత్మ - అన్న మాట నిజమే ! నీళ్ళలోకి తొంగిచూచి, మీరు ఏమి చూచారో వచ్చి నాకు చెప్పండి !"

ఇంద్రుడూ, విలోచనుడూ – నీళ్లలో తమతమ ప్రతిబింబాలను చూచుకొని వచ్చి, –

"స్వామీ ! స్వచ్ఛమైన జలాలలో ఆత్మస్వరూపాన్ని చూచాము. ఆ రూపానికి, కేశరోమాలు ఉన్నవి. మా శరీర ప్రతిరూపం వలెనే ఉన్నది." .... అన్నారు.

సి. వేదవ

విలువైన దుస్తులూ, ఆభరణాలు ధరించి, మళ్ళా నీళ్ళలోకి తొంగిచూచి వచ్చి, తమ అనుభవాలు చెప్పవలసిందిగా ప్రజాపతి శిష్యులకు ఆదేశమిచ్చాడు.

వారు అలాగే చేసి వచ్చి – "స్వామీ ! శుభ్రమైన వస్త్రాభరణాలంకారాలతో ఉన్న మా శరీరాలే అందులో ప్రతిబింబించటం చూచాము." అన్నారు.

"మీరు చూచినదే అమృతమయమైన ఆత్మ" .... అని ప్రజాపతి అనగా తమకు ఆత్మ దర్శనం అయినదని ఆనందిస్తూ, ఆ శిష్యులిద్దరూ తమ తావులకు మళ్ళీ తిరుగు ప్రయాణం ప్రారంభించారు.

ప్రజాపతి వారి వంక జాలిగా చూస్తూ - తనలో తాను ఇలా అనుకొన్నాడు. "ఆత్మ అంటే ఏమీ తెలియకుండానే – తమకు ఆత్మ దర్శనం అయినదన్న భ్రమతో వీరు వెళ్ళిపోతున్నారు. శరీరాన్ని ఆత్మ అనుకుని భ్రమపడేవారికి పతనం తప్పదు."

విలోచనుడు సంతోషంతో తన రాజ్యానికి వెళ్లి "ఆత్మ అంటే మరేదీ కాదు. ఈ శరీరమే ! ఈ శరీరాన్నే

శ్రీ గురూజీ చెప్పిన కథలు

## దేవో దుర్బల ఘాతకః

ఒకసారి ఒక మేకపిల్ల బ్రహ్మదేవుని వద్దకు వెళ్లింది. వినయంగా నమస్కరించింది. "స్వామీ! అన్ని ప్రాణులను మీరే సృష్టించారు. ఆత్మ రక్షణకోసం వాటికి వివిధ సాధనాలనూ ఇచ్చారు. నాకు మాత్రం ఎటువంటి ఏర్పాటు చేయలేదు. మమ్మల్ని ఎందుకిల్లా బలహీనులుగా సృష్టించావు తండ్రీ? ఇంత అన్యాయం చేస్తావా?" అంటూ ప్రార్థించింది.

బ్రహ్మ కళ్ళు తెరిచాడు. "నీవు చెప్పింది నిజమే. పొరపాటు జరిగింది. అందరికీ ఆహారంగా పనికివచ్చే విధంగా నిన్ను సృష్టించాను. తొందరగా ఇక్కడినుంచి వెళ్లిపో. నీ కోమలమైన దేహాన్ని చూస్తుంటే నాకూ నోరూరుతోంది" అన్నాడు.

బలహీనుడి గతి ఇంతే. ఎక్కడికి పోయినా దాస్యము, తన్నులు తప్పవు.

('కథాకల్పతరువు' నుండి)

మనం పూజించాలి! సేవించాలి!" అంటూ తనవారికి బోధ చేశాడు.

అయితే, ఇంద్రుడికి దారిలోనే సందేహం ప్రారంభమైంది. అలంకృతమైన దేహం అలాగా కనిపిస్తున్నది. అయితే ఈ శరీరం కుంటిదీ గుడ్డిదీ అయితే ఆత్మ కూడా అదే విధంగా ఉంటుందా? నిర్జీవమైతే ఆత్మ కూడా చనిపోతుందా? ఇది ఎంత మాత్రమూ సరి అయిన సిద్ధాంతం అయి ఉండదు!" .... అని వివేచించుకొని, వెనుతిరిగి ప్రజాపతి వద్దకు వెళ్లాడు.

మళ్లా ముప్ఫైరెండు సంవత్సరాల కాలం తన వద్ద ఉండనిచ్చి ప్రజాపతి ఇంద్రునితో ఇలా అన్నాడు.

"సంతోషానుభూతిని పొందగలిగినదీ ఆత్మ. అదే అమరమైన బ్రహ్మ తత్త్వంగా తెలుసుకో!"

సరే అనుకొని నాలుగడుగులు వేశాడో లేదో - ఇంద్రునికి ఈ సిద్ధాంతంలోనూ ఏదో లోపం ఉన్నట్లు తోచింది. "స్వప్నావస్థలో దుఃఖానుభూతి కూడా ఉంటుంది కదా! మరి దుఃఖపడేది ఆత్మ కాకూడదు కదా!"

మళ్లా ముప్ఫైరెండు సంవత్సరాల అనంతరం - ప్రజాపతి శిష్యునితో అన్నాడు. "కలలూ, కలవరింతలూ లేకుండా మనిషి గాఢ నిద్రలో ఉండటమే ఆత్మ"

ఈ ప్రతిపాదన కూడా ఇంద్రునికి అర్థ రహితంగానే తోచింది.

"నిదురించే మనిషికి బాహ్యప్రపంచ జ్ఞానం ఉండదు. ఇట్టి అజ్ఞాన స్థితి ఆత్మ అనటం ఎట్లా సంభవం! తన ఉనికినే తెలుసుకోలేని అచేతనావస్థ ఆత్మ తత్త్వం కానేరదు!"

మరొక అయిదేళ్ళకాలం తన వద్ద ఉండనిచ్చి, ప్రజాపతి ఇంద్రునికి ఆత్మను గురించి ఇలా తెలియపరిచాడు.

"నశ్వరమైనది ఈ శరీరం. మృత్యువు ఎప్పుడైనా ఈ శరీరాన్ని కబళించటానికి సిద్ధంగానే ఉంటుంది. నశ్వరమైన శరీరంలోనే శాశ్వతమైన ఆత్మ నివసిస్తుంది. శరీర ధర్మానికి ఆత్మను జోడిస్తే, సుఖదుఃఖానుభూతులు ఆత్మకు కూడా కలిగినట్లు అనిపిస్తాయి. ఆత్మ శరీర సంబంధం వల్ల ఈ ఆనంద విషాదానుభూతులు తప్పవు. ఈ దేహాత్మ బంధం తీరగానే, ఈ సుఖాల దుఃఖాల అనుభావ బంధాలనుండి ఆత్మకు విముక్తి కలుగుతుంది.

భౌతిక బంధాల నుండి విముక్తమైన ఆత్మ - మనస్సు కంటేనూ, ఇంద్రియాల కంటేనూ విశిష్టమైనది. ఇట్టి ఆత్మజ్ఞానం కలిగిన మనిషిని కోరికలు బాధించవు. ముక్తి సామ్రాజ్యమే అతనిది."

ఇది - దీక్షాపరుడైన ఇంద్రునికి ప్రజాపతి - ఆత్మ స్వరూపాన్ని గురించి తెలియచేసిన విధానం — ★

# ప్రాణ స్నేహితులు

పూర్వకాలంలో ఇటలీ దేశంలో డయానిషసు అనే రాజుండేవాడు. ఆతనికి దయాదాక్షిణ్యాలు లేవు. పరమ దుర్మార్గుడు, క్రూరుడు. అతని పొగరుకు సాటి లేదు. ఆతని మనసుకు జాలి లేదు. అతని క్రౌర్యానికి తరుగు లేదు. అతని దౌష్ట్యానికి తిరుగులేదు. ఆతని నెదిరించి ఎవరూ బ్రతికి బట్ట కట్టలేరు. ఆతనిని ఎదిరించినవారు, నిందించినవారు ఆతని చేతిలో హతులై పోవాల్సిందే। ఆతని పరిపాలనలో ప్రజలకు సుఖశాంతులు లేవు. ఆకలిదప్పులతో అలమటించిపోతున్నారు ప్రజలు. అయినా ఆతని నెదిరించే సాహసం ఎవరికీ లేదు. ఇలా ఎంతకాలం సాగాలంటూ కొంతమంది ఆందోళన చెందారు. అందులో ఒక ధైర్యవంతుడు, సాహసవంతుడు అయిన యువకుడు ముందుకొచ్చాడు. అతని పేరు డామను. ధైర్యంగా రాజును, ఆతని పరిపాలనను ఎదిరించాడు. అంతే ! ఇంకేముంది ? రాజధిక్కారనేరం క్రింద ఆతనికి ఉరిశిక్ష విధించేశారు. అయినా డామను విచారించ లేదు. తన చావుతోనైనా రాజు మనసు మారుతుందేమోనని ఆశించాడు. ఆనందంగా ఉరికంబానికి బయలుదేరాడు కాని అంతలో ఆతని ముసలి తండ్రి గుర్తుకొచ్చాడు.

"మహాప్రభూ ! నా తండ్రి ముసలివాడు. ఆఖరిసారిగా ఆ తండ్రిని చూచి తిరిగి వస్తాను. అనుమతి యీయండి" అంటూ రాజును ప్రార్థించాడు. దయాశూన్యుడైన రాజు వికటాట్టహాసం చేస్తూ, "డామన్ ! ఈ వంకతో పారిపోవ నుంకించుచుంటివా ? చేతనున్న నిన్ను వదిలి, చేతులెత్తి మిన్నువంక చూచు జడమతిననుకొంటివా ? " అంటూ ఆతని కోర్కెను తిరస్కరించాడు.

"రాజా ! అసత్యములు పల్కి, నా ప్రాణములు నిల్పుకొనేటంతటి నీచుడను కాను .... ఆడిన మాట తప్పను కొద్దిపాటి గడువీయుము. గడువులోపల తప్పక తిరిగి వచ్చెద"నంటూ మరల ప్రార్థించాడు.

"డామన్! ఇంతగ ప్రార్థించుచున్నావు కనుక నీకు బదులుగ వేరెవరినైన నీస్థాన మందుంచి వెళ్ళు ! గడువు లోపల నీవు మరల రాకున్న నీకు బదులుగా ఆతని నురి తీయించెదను, వింటివా ?" అనెను రాజు.

రాజు మాటలు విన్న డామన్ తనకు హామీ యెవరుందురో యని చింతాక్రాంతుడై దిక్కులు చూచుచుండెను. క్షణకాలమాగెను. ఆతని నిరీక్షణ ఫలించెను.

"నీకు బదులుగ నే నుండెదను. నీకు చింతలు మాని వెడలుము. కన్నతండ్రిని కనులారా కాంచుము. గడువు మాట దేముడెరుగు, పొమ్ము" అంటూ అచటకేతెంచెను ప్రాణమిత్రుడు పిథియాస్.

బాలవాణి
సోమంచి రామం

ప్రాణమిత్రుని గాంచ డామన్ హృదయము కరిగి కళ్ళవెంబడి కన్నీళ్ళు కారసాగెను. మిత్రుని త్యాగమును మెచ్చుకొనగ మాటలే కరువాయెను. చేయునది ఏమియు లేక మిత్రుని వద్ద సెలవు గైకొని తండ్రి జూడ బయలు దేరెను డామన్.

కన్నతండ్రిని కడసారిగ చూచి, మనసార కౌగలించుకొని, కళ్ళనీరు నింపుకొని, దైవమును తలచుకొంటూ గడువులోన మిత్రుని చేర వడివడిగ బయలుదేరాడు డామన్ ।

అంతలో ఆకసమంతా మబ్బులతో గాఢాంధకారమయి పోయెను. దారి కనబడుటలేదు, గాలివానలు జోరాయెను. ప్రకృతి భీభత్సముగ మారిపోయెను. తానెక్కిన గుఱ్ఱము

# శుభోదయం

ఈ దేశ స్వాతంత్ర్యం కోసం
ఆనాడు
ప్రాణాలిచ్చిన మహనీయులు
మనకిచ్చిన సందేశాన్ని
మరచిపోయినాం
విశాల హృదయంతో
సౌభ్రాతృత్వంతో
సౌజన్యంతో
సమతా భావంతో
భారతమాత సేవ చేయండని
భారతీయులుగా తలెత్తి బ్రతకండని
స్వర్ణ భవితలోకి పయనించండని
ఉపదేశించిన
ఆ మహితాత్ముల వాణిని
అలక్ష్యం చేశాం
ఫలితం
స్వార్థం, సంకుచితత్వం
విద్వేషం విద్రోహం
అనైక్యత అశాంతి
నానా వికారాలు
నేస్తం !
మహాత్ముల జీవితాల్ని
మనం అధ్యయనం చేయాలి
మహాత్ముల ఆదేశాల్ని
మనం తలదాల్చాలి
మహాత్ముల పథంలో
మనం పయనించాలి
అప్పుడే అప్పుడే
ఈ దేశానికి
శుభోదయం.

— తిరునగరి

కూలిపోయెను. అశ్వమును విడిచి పరుగు పరుగున సాగెను డామన్ గడువు దాటిపోవుచుండెనను భయముతో. మార్గమంతయు ముళ్ళపొదలు— పడుతూ, లేస్తూ—ఒళ్లంతా రక్తసిక్తమైపోయినా, పరుగు నాపలేదు డామన్!

అక్కడ గడువు దాటిపోవుచుండెనని ఉరికంబమునకు నడిపించసాగిరి పిథియాస్‌ను. ఆనందముగా ప్రాణమిత్రుని కొరకు ప్రాణత్యాగము చేయుటకు పిథియాస్ ఉరికంబమును చేరుకొనెను. తలారి రాజాజ్ఞ కొరకు ఎదురుచూచుచున్నాడు. రాజుగారు అనుమతి సూచనగ చేయిఊపెను.

"ఆగండి.... అతని నురితీయకండి .... ఆపండి .... అతనిని వదిలేయండి" అంటూ రొప్పుతూ, రొజుతూ, మూల్గుతూ, ప్రాకుతూ ఆరిచాడు డామన్.

రాజు ఆశ్చర్యపోయాడు నమ్మశక్యము కాలేదాయనకు! ప్రజలంతా విస్తుబోయి చూస్తున్నారు.

"మహాప్రభూ ! ఆపకండి ! నన్నురితీయండి ! నా మిత్రుని బ్రతకనీయండి !" అంటూ పిథియాస్ తొందరపెట్టసాగెను.

"వద్దు మహాప్రభూ!....నాకొరకు నా మిత్రుడ్ని ఉరి తీయవద్దు ! నేరం చేసింది నేను....నన్ను ఉరి తీయండి" అన్నాడు డామన్.

రాజుకు మతిపోయినంత పని అయింది! ప్రాణముమీది తీపితో నేరములను యితరుల పైకి నెట్టి శిక్ష తప్పించుకునేవాళ్ళనే చూశాడుకాని, మిత్రునికొరకు ప్రాణాలనిచ్చే వాళ్ళను యింతవరకు చూడలేదు. నిజమయిన స్నేహ ధర్మమంటే యిది— అని రాజు తలచాడు. కఠినుడైన రాజు గుండె, కరుణరసముతోడ నిండెనపుడు ! ఆ ప్రాణ స్నేహితులిద్దరు రాజు మనసు మార్చివేశారు.

"ప్రాణముకన్న మిన్నగ ప్రాణస్నేహముండునని మీరిద్దరు నాకు తెలియచెప్పారు. నన్నుకూడ మీ ప్రాణ స్నేహితునిగ తీసికొనే షరతుకు మీరు అంగీకరిస్తే మీ యిద్దరనూ ఉరి తీయకుండ స్వేచ్ఛగ విడిచిపెట్టేస్తాను" అన్నాడు రాజు.

అందరి వదనాల్లోను ఆనందం తాండవించింది. దయానిషను ఆనాటినుంచి దయామయుడై పాలించాడు ప్రజలను !

ఆపదలందాదుకొన్నవాడే
అసలు సిసలైన నేస్తగాడు






# కట్ఫలము

—యస్. యన్. దుర్గారావు

ఇది అడవులలో నుండెడి వృక్షము. దీని కాయలు నున్నగా, ఖర్జూరపు కాయను పోలి యుండును. మ్రాను చెక్క దళసరి. దీనికే కాయ ఫలమని పేరు. గుమ్మడి రేగు అని మరొక పేరు. వైద్యములో దీని చెక్క ముఖ్యోపయోగము. కాయలు కూడా వాడెదరు.

ఇది తీక్షణ వాసన కలది. దీనికి రక రకాల రుచులు అనగా చేదు, కారము, వగరు మొ॥వి కలిగియున్నది. గుల్మ, మేహరోగములు శమింపచేసి రుచిని పుట్టించును. శ్వాసకాసలను హరించును. ముఖరోగములు, మూల వ్యాధులు హరించును. కానీ దీనికి కొంచెము వేడి చేయు స్వభావము ఉన్నది.

కట్ఫల చూర్ణముగానీ, కషాయముగానీ తేనెతో కలిపి సేవించిన అతిసారము హరించును; చూర్ణము నస్యము చేసిన శిరో రోగములు హరించును; కట్ఫలము, ప్రేంఖణము, శంఖము గైరికము, మంచిగంధము సమాన భాగములుగా గ్రహించి బియ్యపు కడుగులో కలిపి, పంచదార చేర్చి ఉపయోగించిన రక్త పిత్తము సందేహం లేకుండా తగ్గిపోవును; (ఈ వస్తువులన్నియు దొరకని యెడల వీనిలో ఏ వస్తువైనను, కట్ఫలముతో చేర్చి పై ప్రకారం సేవించవలయును.) కట్ఫలము మ్రాను పట్టను మెత్తగా నూరి కొబ్బరినూనెతో గానీ, పాత నేతితో గాని కలిపి రాసిన వ్రణములు మానును. కట్ఫల చూర్ణము గళ గండముపై వేసి రాయుచుండినను, లేక నీటితో కలిపి పైన నలుగు పెట్టిన గళ గండము శమించును; దీని రసములో హారతి కర్పూరము కలిపి రాసిన, లేపనము చేసిన మూలవ్యాధి నివారణయగును; కషాయము త్రాగిన శ్లేష్మము దిగును; కట్ఫల చూర్ణము, శొంఠి చూర్ణం, పసుపు కలిపి శరీరమునకు రాసిన కలరావ్యాధిలో చల్లబడిన శరీరము వేడి ఎక్కును. దీనికి చర్మము నెరుపెక్కించి పొక్కుచేయు గుణము కలదు. ★

## తగిన చోటు

స్వామి వివేకానంద అమెరికా పర్యటనలో భాగంగా భారతీయులున్న ఒకచోట ప్రసంగిస్తూ భారతీయులు వీలున్నంతవరకూ స్వదేశీ వస్తువులనే వినియోగించవలె నని ఉద్బోధించాడు. సభలోనున్న ఒక అమెరికన్ మహిళ "స్వామీజీ! స్వదేశీ వస్తువుల వాడకాన్ని ప్రచారం చేస్తున్న తాము విదేశీ పాదరక్షలు ధరించారే" అని ప్రశ్నించింది. స్వామీజీ వెంటనే "భారతీయులు విదేశీ వస్తువులను ఎక్కడవుంచాలో చూపేందుకు యిలా చేశాను" అన్నారు. ఆ మహిళ నిరుత్తర అయింది.

మరొకమారు వివేకానందుడు ఒక క్రైస్తవ మత బోధకుని ఆహ్వానంపై అతని యింటికి వెళ్ళారు. దురహంకారియైన ఆ మత బోధకుడు తన యింటిలోని వివిధ మత గ్రంథ రాశిని చూపిస్తూ "చూశారా! మీ భగవద్గీత అన్ని మత గ్రంథాల అట్టడుగున వుంది" అన్నాడు. వివేకానందుడు చిరునవ్వుతో "భగవద్గీత వుండవలసిన చోటే వున్నది. అన్ని మత గ్రంథాలకు మూలాధారం భగవద్గీత" అన్నారు. పాస్టర్ తెల్లబోయాడు.

— జానమద్ది హనుమచ్ఛాస్త్రి

(రసవద్ఘట్టాలు గ్రంథం నుండి)

“ఈ యీ కారణాలవల్ల ఆధునిక వైద్యశాస్త్రం పూర్తిగా విఫల మైందని నేను సిద్ధాంతీకరిస్తున్నాను.

ఇది రోగాన్ని కాక రోగినే నిర్మూలిస్తున్నది.

ఒక విషమయమైన జబ్బును నయంచేయడానికిగాను మనం ఇంకా భయంకరమైన విషాలు అతని కడుపులోకి చర్మంలోకీ తలలోకి ఎక్కించి రోగి పూర్ణాయువును సంకుచిత పరుస్తున్నాము.

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్




# హ్యూమానిటీ ఫర్ సేల్

ఇది రోగ నిదాన విధానం కానే కాదు. ఎంత త్వరగా దీని నుంచి ప్రపంచానికి మనం విముక్తిని ప్రసాదిస్తే మానవాళికి మనం అంత సేవను నిజంగా చేసిన వాళ్ళ మవుతాము ”

వైద్య మండలి సభలో ఈ పేపరును మకరంద్ చదవగానే ముందు వరుసలో కూర్చున్న చాలామంది ఎం. డి. లు మకరంద్‌ను పరిహసించారు. వెనుక కూర్చున్న చాలామంది ఎం. బి. బి. యస్. లు కేకలు వేశారు. వైద్యమండలి కార్యదర్శి చదవ వలసిన పేపర్ కాదిది. వైద్యవృత్తికే విద్రోహ కరంగా వుందిది. “ఇతన్ని వెంటనే సెక్రెటరీ పదవినుంచి డిస్‌మిస్ చేయాలి ”

“ నిజంగా వీడికి మతే పోయింది ” ఇలా రకరకాల వ్యాఖ్యానాలు.

మకరంద్ సవినయంగా అన్నాడు. “ మీ సూచన లకు కృతజ్ఞతలు. ఈ పదవి కావాలని నేను కోరలేదు. అయినా వచ్చింది. ఇప్పుడు దిగమంటున్నారు. నేనే అసలు రాజీనామా చేయాలని నిశ్చయించుకున్నాను. మానవాళికి సరియైన రోగ విధాన పద్ధతి దొరికేవరకు నేనసలు వైద్య వృత్తినే విడిచిపెడుతున్నాను. క్లినిక్‌ను నేడే మూసి వేస్తున్నాను ” మకరంద్ కిందకి దిగాడు.

సభలో గందరగోళం - చప్పట్లు - వ్యాఖ్యానాలు - కల్లోలం మధ్య సభ ముగిసింది.

ఈ జరిగిన విషయమంతా శ్యాం రాజుకు చేరవేశాడు. “ శని విరగడైంది. ఇదే సమయం. లతతో నేను చెప్పమన్నానని చెప్పు. వాడు తప్పకుండా కార్యదర్శిగా డబ్బును దుర్వినియోగపరచే ఉంటాడు. ఆ రిపోర్టులు తయారుచేయండి. వాణ్ణి బజారుపాలు చేయాలి. బరకత్ పురా నుండి తరమాలి ”

“ అంతేకాదు బాస్ ఇటీవల వీడు కొందరు రోగులను చంపాడట. వాటిని గుట్టుచప్పుడి కాకుండా లంచాలుపెట్టి పైరవీచేసి రెండోకంటివాడికి తెలియకుండా దహనాలు చేయించాడుట.

దీనివల్లనే వాడి మనస్సు విరిగిందని వర్తమానం సేకరించాను "

" భేష్ — భేష్ — " కూతురు మరణానంతరం తొలి సారి రాజు ముఖాన ఆనందరేఖ తాండవించింది. " ఇంకేం దీన్ని బనిగట్టుకొని ప్రచారం చేయించు. నామరూపాలు లేకుండా చెయ్యాలి వాణ్ణి "

" అట్లాగే బాస్ " శ్యాం అనడంతో ఊరుకోడు. అతడిది మాట ఒకటి చేత ఒకటీ కాదు. ఏది చేసినా మనోవాక్కాయకర్మలా త్రికరణ శుద్ధిగా చేసే మహ పురుషుడు శ్యాం.

మకరంద్‌ను ఎన్ని విధాల అవమాన పరచాలో అన్ని మార్గాలు ప్రయోగించాడు.

ఇప్పుడు మకరంద్ దవాఖానా వైపుకే మనుషులు పోవడం లేదు.

మకరంద్ మూయవలసిన పని లేకుండానే అదే మూతపడిపోయింది.

ఒకరోజు ఉదయం నరసింగరావు అన్నాడు. "బాస్! నా కిక శలవిప్పించండి. మరోచోట (వర్కు) ఉద్యోగం చూచుకుంటాను. "

మకరంద్ సింగు ముఖం చూచాడు.

నిజంగా సింగు ఓపికవల్లనే ఇంతకాలమూ దవాఖానా నడిచింది. అలాంటి సింగూ తన్ను వదలిపెట్టి పోతున్నాడు.

మకరంద్ ఏమీ మాట్లాడలేదు.

చెక్ బుక్ తెచ్చి దానిలో ఒక చెక్కుపై సంతకం చేసి సింగుకిచ్చాడు.

" ఏమిటిది "

" సింగూ నీ నేర్పూ ఓర్పూ వల్లనే నేను చాలా సంపాదించగలిగాను. వద్దన్నా ధనం గుట్టలు గుట్టలుగా వచ్చింది. కనకవర్షం కురిసింది. దానితో మా అమ్మగారి ఆశ్రమాన్ని ఎంతో ఉద్ధరించగలిగాను. చాలా ఆర్థిక సహాయం చేశాను కూడా. కాని నాకెందుకో అసంతృప్తి

( జరిగిన కథ )

లత మకరంద్‌తో పరిచయం పెంచుకో సాగింది. అందులో భాగంగా ఆమె మకరంద్‌ని భోజనానికి పిల్చింది. ఆమె వెళ్ళే సరికి మకరంద్ ట్రీట్‌చేసిన పేషెంట్ కల్తీ మందులవల్ల చనిపోయాడు. అయితే మకరంద్ ఆ కంపెనీవాడిమీద కేసు పెడ్తావన్నాడు. చివరకి అటుతిరిగి ఇటుతిరిగి మకరంద్ చేతకానితనం వల్లనే ఆ పేషెంట్ చనిపోయాడని ఆ మృతుడి బంధువులు ఆరోపించారు. దాంతో మకరంద్ నిస్సహాయుడై పోయాడు.

(ఇక చదవండి)

కలిగింది. నేను ఒక రోగం నయంచేసి రోగిని పంపినా అతని శరీరంలోని అనేకమైన సూక్ష్మాతి సూక్ష్మమైన సున్నితమైన జీవకణాలను నిర్మూలించి పంపుతున్నానని గుర్తించాను. కాబట్టి ఈ డబ్బు నేను చేస్తున్న పాపానికి ప్రతిఫలమని భావించాను. ఇలాంటి డబ్బుతో నేను మా అమ్మగారి ఆశ్రమాన్ని ఉద్ధరించదలుచుకోలేదు. ఇక పైన — ఈ సంపాదన నాకు వద్దు. నీవు భార్యా బిడ్డలు కలవాడివి. నిష్కామంగా నా మీద ప్రత్యేకమైన అనురాగంతో ఎంతో సేవ చేశావు. నేనూ ఏదో ఇస్తూనే వచ్చాను కాని దానితో నీ ఋణం తీరదు. ఇదుగో ఖాళీ చెక్కు ఇస్తున్నాను. కావలసింది బ్యాంకు నుంచి తీసుకొని వెళ్ళు .... "

మకరంద్ మరి మాట్లాడలేదు.

కన్నీళ్లతో నరసింగరావు నిష్క్రమించాడు, చెక్కు తీసుకొని.

అతని నిష్క్రమణంతో క్లినిక్‌కు భరతవాక్యం శాశ్వతంగా పలికినట్టైంది.

మేడపైన లతా మకరంద్ కూర్చున్నారు. ' ఊఁ - మరి నీ భవిష్యత్కార్యక్రమమేమిటి ? "

"ఇంకా ఇదమిద్ధంగా నిర్ణయించుకోలేదు. నూతనమైన వైద్య విధాన మేదైనా అన్వేషించాలనుకుంటున్నాను. అప్పటివరకూ మా తల్లిగారి ఆశ్రమానికే యథోచితంగా చేయాలని భావిస్తున్నాను. "

" మరి మీ వివాహం .... "

" నా జీవన ప్రయోగానికి అది ఎంతవరకు ఉపయోగిస్తుందో చెప్పడం కష్టం. "

" నీవు చెప్పకపోతే నేను చెప్పుతాను - చెయ్యి ఇలాతే "

" నాకు జాతకాలమీదా సాముద్రికాల మీద నమ్మకం లేదు. మనిషికేమిటి కోతి చేతిలో కూడా ఇలా రేఖలుంటాయి. "

" నీకు లేకపోతే నాకుంది - " అంటూ సున్నితంగా మకరంద్ కుడి అరచేతిని తన రెండు చేతులలోకి తీసుకొని సున్నితంగా గిల్లి ముద్దుపెట్టుకోబోయింది. మకరంద్ చెయ్యి గుంజుకున్నాడు.

" మరి నాకు శలవిప్పించండి "

" అదేమిటి భోజనం కాకుండానే ఈ హడావుడి "

మకరంద్ బదులు చెప్పలేదు. చెప్పులు కాళ్ళకు తగిలించుకున్నాడు.

" మకరంద్ - మకరంద్ - మనమింకా చాలా మాట్లాడుకోవాలి. స్వంత విషయాలూ, నీవు వదిలిన సెక్రెటరీ పోస్టు వివరాలు - "

" సెక్రటరీగా ఉన్నప్పటి ఫైలు పంపిస్తున్నాను చూచుకోవచ్చు .... "

లత మేడమెట్ల దగ్గరికి వచ్చింది.

మకరంద్ దిగుతున్నాడప్పుడే

అడ్డంగా నిలబడింది.

లెక్కలు కూడా చూడాలి "

" చూచుకోండి. తేడావస్తే నా చేతి పైన లిప్పుకుంటాను. నన్ను వెళ్ళనివ్వండి "

" మకరంద్ - మాట్లాడు - ఎందుకంతకోపం నా మీద - నేను చేసింది సాముద్రిక శాస్త్రంలోని ఒక భాగం. "

మకరంద్ నిలబడ్డాడు.

లతను నిలువునా ఒక్కసారి చూచాడు.

ఒక్కక్షణం నిశ్శబ్దాన్ని నలుదిక్కులా పరిచిన తరువాత దాన్ని తన వాక్కులతో ఛేదిస్తూ ఇలా అన్నాడు. " అమ్మా ! ఈ లోకంలో ఎవ్వరూ ఏమీ తప్పు చేయడం లేదు. మీరూ నేనూ అందరం మన మన ప్రవృత్తుల ననుసరించి యాత్ర సాగిస్తూనే ఉన్నాము. కాకుంటే తప్పు కొంతవరకు నా జన్మానిది. నేను నాకు తగని కాలంలో జన్మించాను. ఈ కాలానికి నేను సరిపోను. కాలానికి సరిపోని నేను, కాలాన్ని నాకు అనుగుణంగా సరిపుచ్చుకోనేటట్లు మలిచే పెద్ద ప్రయత్నం చేస్తున్నాను. ఈ ప్రయత్నాన్ని విఫలం చేసేందుకు మీ వంటి తల్లులు కూడా ప్రయత్నించడం నా దురదృష్టం. అమ్మా ! నీవెవరు ? జగన్మాత యొక్క ఒక అంశవు కావా ? నాకు జన్మనిచ్చిన తల్లికి మరో ప్రతిబింబానివి కావా ? .... మరి నీకీ మానవ అసహజమైన వికార మేమిటి ? "

లత స్తంభించిపోయింది.

ఆమె తల బద్దలైనట్లు అనిపించింది.

తూలి పడుతున్నట్లు తోస్తున్నది.

మకరంద్ లతకు గౌరవంగా నమస్కరించి మేడ కిందికి వచ్చి గేటు తీసుకొని చకచకా తన ఇంటికి నడిచిపోయాడు.

* * *

( సశేషం )

# శ్రీ సత్యసాయి గాయత్రీ దర్శనం

ఈ మహిమాన్వితమైన మంత్రం పది సంవత్సరాల క్రిందట శ్రీ సత్యసాయిబాబావారి సమక్షంలో ఒక ప్రసిద్ధమైన మహా వేదపండితుని ముఖం ద్వారా భక్త బృందానికి అందజేయబడినది. ఇప్పటికీ నాకా దృశ్యం కళ్లకు కట్టినట్లు కనిపించుచున్నది. 24 డిశెంబరు 1977 రోజున బెంగుళూరు వైట్ ఫీల్డులోని స్వామి మందిరం — సంధ్యారాగ సమయమది - అస్తమయ సూర్యకాంతులు ఆ శ్యామసుందరుని పీతాంబరముల మీద తళుకు బెళుకుగా ప్రసరించుచున్నవి. ఆ వరండా పరిసరాలు, కళాశాల విద్యార్థులు, అధ్యాపకులు, వైజ్ఞానికులు, ఉన్నతాధికారులు, పండితులతో క్రిక్కిరిసి కలకలలాడుచూ యున్నది. ఆ సమయంలో స్వామి అతి ఆప్యాయంతో విజయనగర ఆస్థాన మహా విద్వాంసులు, అభినవ విద్యారణ్య బిరుదాంకితులు, సంస్కృత కవులు, ప్రశాంతి విద్వన్మహాసభ ప్రారంభక సభ్యులు, వయోవృద్ధులు అయిన ఘండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని చిన్న ప్రవచనం చేయమని కోరినారు. ఆగంతుకంగా వచ్చిన అవకాశంలో నా పూజ్య పితృపాదులైన శాస్త్రిగారి మేధడులో అద్భుతమైన చైతన్య స్రవంతి ప్రవహించి. బహిర్గతమైనది. అదియే ఈ అమూల్య మంత్రం, నాన్నగారు అప్పుడు చెప్పిన ఉపన్యాసమును సంగ్రహముగా మార్చి 1979 ఇంగ్లీషు 'సనాతన సారధి'లో నివేదించడమయినది. దానినే తెలుగులో ఇపుడు పునరుద్ఘాటించుచున్నాను.

(మం) ॥ సాయీశ్వరాయ విద్మహే
సత్యదేవాయ ధీమహి !
తన్న స్సర్వః ప్రచోదయాత్ ॥

(తా॥) శ్రీ సత్యసాయిని సాక్షాత్తు భగవంతుడని, ఈశ్వరుడని గురువులవల్ల, శాస్త్రాలవల్ల అనుభవం వలన నేను తెలిసికొనుచున్నాను. "

" పరబ్రహ్మ స్వరూపుడైన ఆ సాయి పరమేశ్వరుడు మా యొక్క బుద్ధులను మంచి పనులయందు, సత్కర్మానుష్ఠానములయందు ప్రేరణ చేయునటు ప్రార్థించుచున్నాను "

" ఆ సత్యసాయిమూర్తిని, సత్యస్వరూపుడు, చిత్స్వరూపుడు, సర్వజగద్వ్యాపకుడు, సర్వదేవతా స్వరూపునిగా నా హృదయంలో మనఃపూర్వకంగా ధ్యానించుచున్నాను. "

## ఘండికోట వెంకటసుబ్బారావు

" ఈ సత్యసాయీ గాయత్రీ - ఇతర గాయత్రులవలె ఒక వేదమంత్రం. ఇది చతుర్వింశతి గాయత్రీ-అంటే 24 అక్షరములతో యున్నది - మూడు పాదాలున్నవి. పాదానికి 8 అక్షరములున్నవి. దీనిలో ఒక అత్యద్భుతమైన విశేషమున్నది. మహర్షి వరరుచి సూత్రప్రకారం అక్షర సంఖ్య మొత్తం 109. ఈ మంత్రాన్ని 108 సార్లు జపం చేసిన తరువాత, మేరు పర్వత శిఖర సాధనకు ఆఖరి మెట్టులాగ, సంసిద్ధికి 109 వ సంఖ్య గుర్తు. అది సాయి భగవానుని ప్రసాద సిద్ధికి మూలం"

" ప్రతి మంత్రానికి, ఛందస్సు, ఋషి, అధిష్ఠాన దేవత యుండును. అటులనే ఈ మంత్రం గాయత్రీ ఛందస్సులో యున్నది. మంత్ర ద్రష్ట ఘండికోట సుబ్రహ్మణ్యశాస్త్రి. మంత్రాధిష్ఠాన దేవత ప్రత్యక్ష భగవాన్ సత్యసాయీశ్వరుడే ! "

ఈ సత్యసాయి గాయత్రీ సారాన్ని, సుబ్రహ్మణ్య శాస్త్రిగారు అనుష్టుప్ శ్లోకంలో వివరించి భక్తులకా సమయంలో అందించినారు.

శ్లో॥ యోదేవస్సత్య సాయీవః
బుద్ధిం ధర్మాదిగోచరాం ।
ప్రేరయేత్తస్య యత్తేజః
తద్వరేణ్య ముపాస్మహే ॥

తా॥ "ప్రకాశ స్వరూపులైన సత్యసాయి పరమేశ్వరులు. మా బుద్ధిని సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింస, త్యాగమయంగా, సర్వదా మా హృదయ కుహరంలో ఉండి మమ్ము ప్రేరేపించుగాక । ఆ శ్రేష్ఠమైన ఆ సత్యసాయీశుని తేజస్సు కేవలం శరీరావచ్ఛిన్న శుద్ధ చైతన్యమే. దానిని మేము శ్రద్ధతో ఉపాసించుచున్నాము "

## సందేహ నివారణ

ఈ సందర్భంలో ఒక సందేహ నివారణ చేయవలసిన దిగా పూజ్య పితృపాదులు ఈ విధంగా చెప్పినారు.

" సత్య సాయీ గాయత్రీ మంత్రములో మూడవ పాదములోని సర్వ శబ్దముయొక్క స్థానములో సాయి శబ్దమున్నపుడే సాయి గాయత్రీ అగునని కొందరు సందేహ పడవచ్చును. కాని, అట్లు అవసరం లేదు "

" మంత్ర మహార్ణవములో అనేక దేవతల గాయత్రు లున్నవి. ఉదాహరణకు, హయగ్రీవ గాయత్రీ ఈ విధంగా ఉన్నది. " వాగేశ్వరాయ విద్మహే, హయ గ్రీవాయ ధీమహి, తన్నో హంసః ప్రచోదయాత్ " ఇందులో మూడవ పాదములో హయగ్రీవ శబ్దము లేక, హంస శబ్దమున్నను, దీనికి హయగ్రీవ గాయత్రీ అనియే మంత్రమహార్ణవంలో నున్నది. కాన, సాయి గాయత్రి లోని సర్వ శబ్దమున్నను, సాయి గాయత్రీ అని వ్యవహ రించుటయే శాస్త్ర సిద్ధమగును. ఇంకొక విషయం. ఈ సాయి గాయత్రిలోని సర్వ శబ్దము పరబ్రహ్మ వాచకము.

తైత్తిరీయ నారాయణోపనిషత్తులో

" సర్వేభ్య స్సర్వశర్వేభ్యః " అను మంత్ర వాక్యము నకు విద్యారణ్య భాష్యములో ఇట్లున్నది. " తత్సృష్ట్వా తదేవాను ప్రవిశత్ " ఇతి శ్రుత్యా సర్వాంతర్యామి త్వేన పరమేశ్వర సంయుక్తం సర్వ రూపత్వం - అని సర్వ శబ్దమునకు సచ్చిదానంద శుద్ధ నిర్గుణ పరబ్రహ్మా ర్థకత్వమును వ్రాసిరి. "

" కాన, శ్రీ సత్యసాయి గాయత్రి శుద్ధ బ్రహ్మ ప్రతిపాదకమనియు, శ్రీ సత్యసాయి సాక్షాత్ పరమాత్మ స్వరూపులనియు సాయి గాయత్రియొక్క తాత్పర్యం. "

## వేదపరిషత్ స్థాపన

ఈ మహిమాన్వితమైన సత్యసాయి గాయత్రీ ద్రష్టలైన సుబ్రహ్మణ్యశాస్త్రిగారు క్రిందటి అక్షయనామ సంవత్సర దసరామహోత్సవ ప్రారంభంలో అంటే ఆశ్వయుజ శుద్ధ పాడ్యమినాడు పరమపదించినారు. ఆ తరు వాత, విజయదశమిరోజున సాయంత్రం శ్వేతాంబర ధారులైన శ్రీ భగవాన్ సత్యసాయిబాబావారు పూర్ణచంద్ర వేదికపై ఝూలా మహోత్సవానంతరం వేదప్రాశస్త్యాన్ని ఉద్ఘాటిస్తూ, వేదార్థ పండితులైన కీ॥ శే॥ ఘండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వైదుష్యాన్ని ప్రశంసించి, వారి జ్ఞాపకార్థం శ్రీ సత్యసాయి సుబ్రహ్మణ్యశాస్త్రి వేద పరిషత్‌ను ప్రారంభించినారు. ఆ సందర్భంలో బాబా వారిచ్చిన దివ్య ప్రవచనాలు :

" యుగ యుగాలనుండి తర తరాలనుండి కోటాను కోట్ల కంఠాలతో కీర్తించబడిన భారతీయ సంస్కృతి, అందులోని వేద ప్రమాణము - కాల ప్రభావంచేత, మానవుని మనః ప్రభావం చేత దిన, దినము తరిగిపోవు చున్నది. "

" ఈనాడు వేద, వేదాంత, శాస్త్రార్థములను చక్కగా సామాన్య ప్రజలకు అర్థమగునట్లు బోధించు వ్యక్తులు కరువైపోయినారు. ఈనాడు వేదములను సముద్ధరించ లేకపోయిన యెడల భవిష్యత్తులో భారతదేశ స్థితిగతులు ఏ విధంగా మారునో కదా ! "

" వేద ప్రమాణములు నశించిన, భారతీయ కీర్తియే నశించిపోవును భారతీయ ప్రాణము, ప్రమాణము. వేదములపైనే ఆధారపడియున్నవి. కనుక, తిరిగి వేదములను పునరుద్ధరించు నిమిత్తం సత్యసాయి సంస్థలు అనేక విధములయిన ప్రయత్నములకు సంసిద్ధమై యున్నవి. "

" ఘండికోట సుబ్రహ్మణ్యశాస్త్రి శత వర్షములు జీవించిన వేదపండు. వేద, వేదాంత, వేదార్థములను గుర్తించిన మహా పండితుడు. విజయనగరం సంస్థానమందు తన పాండిత్యమును ప్రకటించి గొప్ప కీర్తి సాధించినటువంటివాడు. ఆంధ్ర దేశములో సాటిలేని మేటి "

" అతను కేవలం వేద ప్రమాణములతోనే కాక, భక్తి ప్రపత్తులయందు కూడ తన జీవితమును పూర్ణము గావించిన వ్యక్తి. ఆతనికి స్వామిపై మక్కువ ఎక్కువ. అతని విశ్వాస మెట్టిదనగా, సర్వ వేదసారమును గుర్తించిన మహా పండితుడయి, సత్యసాయి సర్వదేవతా స్వరూపుడనే సత్యాన్ని గుర్తించి తన అంత్య జీవితమును స్వామి సన్నిధియందే గడుపుతూ వచ్చాడు. ప్రశాంతి నిలయంలో " శత వర్షములు " నింపుకున్నాడు. అతని జ్ఞాపకార్థమై - వేదశాస్త్ర అభివృద్ధి నిమిత్తమై శ్రీ సత్యసాయి సుబ్రహ్మణ్యశాస్త్రి వేదపరిషత్ ను నేడు ప్రారంభించుచున్నాము. ఇతడు ఎంతకాలమైనప్పటికి అమరుడనే చెప్పవచ్చును. అనంతమైన, అమృతమైన హృదయము కలవాడు కనుక అమృతత్వానికి అధికారమున్నది. అందుచే అతని ఆదర్శాలను, సద్గుణములను, వేదార్థములను విరివిగా చాటి వేదప్రమాణములను ప్రధానముగను, ఆధారముగను భారతీయులు అనుసరించి, ప్రాచీనమైనటువంటి వేద సంస్కృతిని పునరుద్ధరింప జేసిన తిరిగి మన భారతదేశం ప్రాచీన వైభవంతో రూపొందునని ఆశిస్తూ, ఆశీర్వదించుచున్నాను. " **బాబా.** ★

# స్వ వా

రాజమండ్రిలోని రామచంద్రపురంటౌన్‌హాల్లో ఆంధ్ర విజ్ఞాన పరిషత్తు ఆధ్వర్యంలో వార్షికోత్సవాలకు **డా॥ తోలేటి** కనకరాజుగారు జనాల్ని ఆకర్షించడానికి చెళ్ళపిళ్ళవారినీ, విశ్వనాథనూ యిద్దరినీ ఆహ్వానించారు. సభ జరుగుతోంది. చెళ్ళపిళ్ళవారి ప్రసంగం సహజ గంభీరంగా ముగిసింది. ఇంతలో సత్యనారాయణగారు ఉపన్యాసానికి ఆయత్తమవుతుండగా —

టేబుల్ మీద పెట్టిన మంచినీళ్ళ గ్లాసు తిరగబడి, బల్లమీదున్న రంగుల గుడ్డ మీదుగా నీళ్ళు కారుతున్నాయి.

వెంకటశాస్త్రిలుగారు అతి కొంటె —

" ఒలికింది ఒలికింది ఒగల కిన్నెరసాని
కులికింది కులికింది కోరి కిన్నెరసాని
తడిసింది తడిసింది పొడిది మేజాగుడ్డ "

అని ' అతి సీరియస్‌గా ' గా మొహం పెట్టి పాడడం ప్రారంభించారు. కొత్త కవిత్వం మీద వెటకారమే గాని, సత్యనారాయణమీద ప్రేమ లేకపోవడం కాదు.

సభ అంతా ఒకటే గొల్లున గోల - పావుగంటసేపు - వాన వెలిసింది.

సత్యనారాయణగారు ఇంకొకరినైతే నమిలి మింగేసేవారు. కాని - ఇక్కడ గురువుగారు.

నవ్వుతూ మొదలెట్టారు.

ఆ నవ్వు ఎర్రగా వుంది.

" గురువుగారికి కిన్నెరసానిమీద ఇంత అభిమానమని నాకు తెలియదు. ఎంత బాగా జ్ఞాపకం ఉంచుకున్నారు. చిత్రమేమంటే - ఒక పరగణాకు చెందిన పెద్ద రౌడీ దగ్గర ఆ పరగణా శిష్యులు మాట్లాడరు " అన్నారు.

ఇది ఆ గురు శిష్యుల మర్యాద.

— ముదివేడు ప్రభాకరరావు

## పింగళి వెంకయ్యగారు ( 3వ పేజీ తరువాయి )

భారత ప్రజలకు అందచేశారు. గత నాలుగు సంవత్సరాల నుంచి శ్రీ వెంకయ్యగారు ప్రతి భారత జాతీయకాంగ్రెసు మహాసభలోను జాతీయపతాక సమస్యను గురించి అత్యంత ఉత్సాహంతో దీక్షతో చేసున్న కృషిని నేను ఎప్పుడూ కొనియాడుతున్నాను. బెజవాడలో వెంకయ్యగారిని "త్రివర్ణముల పతాకమున రాట్నం చిహ్నితమై ఉండాలి" అని నేను చెప్పగా వారు వెంటనే చిత్రించి ఇచ్చారు. వారి అకుంఠిత ఉత్సాహం ఫలితంగా మూడు గంటలలో నేను ఒక పతాకమును పొందగలిగాను."

అఖిల భారత జాతీయ కాంగ్రెసు సంఘంవారు 1921లో సమావేశమై ఈ పతాకను కాంగ్రెసు పతాకగా ఆమోదించారు.

మన దేశం స్వతంత్రం అయిన తరువాత 22-7-1947 తేదీన భారత రాజ్యాంగ సభ సమావేశమై ఈ పతాకను జాతీయ పతాకగా ఆమోదించింది. పండిత జవహర్‌లాల్ నెహ్రూ సలహాను అనుసరించి పతాకలో ఉన్న రాట్నం చిహ్నానికి బదులుగా అశోకచక్రాన్ని ఉంచటం జరిగింది.

## వజ్రాల పరిశోధన

జాతీయ పతాక నిర్మాణం అయిన తరవాత వెంకయ్యగారు రాజకీయ రంగంనుంచి దూరం అయినారు. మద్రాసుకు వెళ్ళి ప్రెసిడెన్సీ కాలేజీలో భూగర్భశాస్త్రం మీద పరిశోధనలు చేసి డిప్లొమా పొందారు. తరువాత నెల్లూరు చేరి అక్కడే 1924 నుంచి 1944 వరకు ఉన్నారు. కాకిబంగారం (మైకా) గురించి పరిశోధన చేశారు. కరూరు, హంపీ ప్రాంతాలలో వజ్రాల గురించి పరిశోధన చేశారు. ఏ ఖనిజం మన దేశంలో ఏ జిల్లాలో ఏ ప్రాంతంలో లభ్యం అవుతుందో వెంకయ్యగారు నిల్చున్నపళాన చెప్పేవారు అంత కూలంకష జ్ఞానాన్ని ఆర్జించారు. గవర్నమెంటు సర్వే రిపోర్టులలో వెంకయ్యగారిని గురించీ, వారి సలహాలనుగురించీ ఎన్నో వివరాలు తెలుసాయి.

అంతవరకు ప్రపంచంలో ఎవ్వరికీ తెలియని వజ్రపు తల్లిరాయిని వెంకయ్యగారు కనుగొన్నారు. అప్పటివరకు బొగ్గు వజ్రంగా మారుతుందనే శాస్త్రజ్ఞుల అభిప్రాయం. ఈ తల్లిరాయిని గురించి ఇంగ్లీషులో ఒక గ్రంథం వ్రాశారు వెంకయ్యగారు. దానిని పరిశోధించిన పాశ్చాత్య శాస్త్రవేత్తలు వెంకయ్యగారి ప్రతిభను గుర్తించి ఆయన ఆ శాస్త్రంలో ఒక నూతన అధ్యాయాన్ని సృష్టించారని అంగీకరించారు.

## వెంకయ్యగారు ఎలా ఉండేవారు?

వెంకయ్యగారు అజాను బాహువు. ఆరడుగుల ఎత్తుండేవారు. నల్లని రంగులో ఉక్కుమనిషిలా ఉండేవారు. బక్కపల్చని శరీరం. తీరయిన ముఖ కవళికలు. కంచులాంటి కంఠస్వరం. నిష్కళంకమైన దేశభక్తుడు. నిష్కామ కర్మవీరుడు. అవినీతిని బొత్తుగా సహించని ఆదర్శ ప్రవృత్తి. ఎన్ని కష్టాలనయినా ఎదుర్కొనగలిగిన ధీరుడు.

పింగళివారిది గౌతమ సగోత్రం. వీరిది మహారాష్ట్ర నుంచి ఆంధ్రకు వలస వచ్చిన కుటుంబం. పింగళి మోరోపంతు వంశానికి పేరు చెందినవాళ్ళనీ, ఝాన్సీ లక్ష్మీబాయి వారి యింటి ఆడపడుచు అనీ వెంకయ్యగారి పరిశోధనలవల్ల వెల్లడి అయింది. నైజాం నవాబు వద్ద మహాసేనానిగా కీర్తి గడించిన పింగళి మాదన్నకూడా వెంకయ్యగారి వంశం వాడేనట.

## ముగింపు

పింగళి వెంకయ్యగారు మహామేధాసంపన్నుడనీ, బహుముఖ ప్రజ్ఞాశాలి అనీ, అకలంక దేశభక్తుడనీ మనం తెలుసుకున్నాం. ఇవన్నీ ఒక ఎత్తు. ఆయన మన జాతీయ పతాక నిర్మాత అని గుర్తించడం ఒక ఎత్తు. ఇతర దేశాలలో జాతీయ పతాక నిర్మాతలను ఆ ప్రభుత్వాలు ఎన్నో బిరుదుల్నీ, వసతులనూ, ధనాన్ని యిచ్చి వాళ్ళను ఎంతగానో గౌరవించాయి. మన ప్రభుత్వం వెంకయ్యగారి విషయంలో ఏమీ చేయకపోవడం చాలా దురదృష్టకరం. జాతీయపతాకాన్ని గురించి

ప్రభుత్వం ప్రచురించిన పుస్తకంలో పతాక నిర్మాత ఒక తెలుగువాడు అని మాత్రం సూచించింది. ఆయనను గురించిన వివరాలు ఏవీ ఇవ్వలేదు సరికదా, కనీసం ఆయన పేరునుకూడా ఉదహరించలేదు.

ఇటువంటి నిష్కామ కర్మవీరుడు చివరి రోజుల్లో తిండికి కూడా మొహంవాచి, నానా అగచాట్లు పడ్డారు. చివరి దశలో విజయవాడలో డాక్టర్ కె. ఎల్. రావు, డాక్టర్ టి వి ఎస్. చలపతిరావు, జి ఎస్.రాజు, కొత్రగడ్డ శ్రీనివాసరావు, డాక్టర్ గూడూరు నమశ్శివాయ మొదలైన పెద్దలు వెంకయ్యగారికి సన్మానం చేసి (15-1-1963) కొంత నిధిని వారికి అందచేశారు. వారికి తోచిన రీతిని ఇతర మార్గాలలోకూడా ఉచితమైన సహాయం చేశారు. అది జరిగిన సుమారు ఆరునెలలకు (4-7-1963 తేదీన) వెంకయ్యగారు కీర్తిశేషులయ్యారు.

ఆయన చనిపోయే రోజున చివరి కోరికగా ఇలా చెప్పారు ; "నా అంత్యదశ సమీపించింది. నేను చని పోయిన తరువాత త్రివర్ణ పతాకం శవం మీద కప్పండి. శ్మశానానికి చేరిన తరవాత ఆ పతాకం తీసి, అక్కడ ఉన్న రావిచెట్టుకు కట్టండి. ఇదీ నా తుదికోర్కె."

ఇటువంటి దేశభక్తుణ్ణి ఆంధ్రమాత భారత జాతికి అందించింది. అటువంటి సత్కార్యం మళ్లా ఎప్పటికి జరుగుతుందో !



## ప్రశాంతినిలయం

(12వ పేజీ తరువాయి)

ఓ సాయి నాథా ...
ఓ సత్యసాయీ ...
కరుణించి, కనికరించి
దీవించి పంపవయ్యా ...
శ్రీ సాయి నామము
ఇంటింట వినిపించ
దివ్యశక్తిని యిచ్చి
దీవించి పంపవయ్యా ...



సాయి వాణిని
గ్రామగ్రామమున వినిపించ
శక్తి సామర్థ్యముల నిచ్చి
దీవించి పంపవయ్యా ...
ఆత్మ విశ్వాసమును పెంచి
ఆయురారోగ్యముల నిచ్చి
కరుణించి, కనికరించి
దీవించి పంపవయ్యా ...

శ్రీ సత్యసాయి మహిమలను, అనుభూతులను తలచు కుంటూ, వారిచ్చిన ఆధ్యాత్మిక సందేశములను స్మరించు కుంటూ 19 గంటలు ఆర్. టి. సి. బస్సులో ప్రయాణం చేసి 19 వ తేది ఉదయం బందరు చేరాను. ప్రశాంతి నిలయం అనుభవాలను, అనుభూతులను శ్రీవాణి పాఠకు లకు అందించటానికి అవసరమైన శక్తి సామర్థ్యములను అందించినందులకు భగవాన్ శ్రీ సత్యసాయికి కృతజ్ఞతాభి వందనలు. ఓం సాయిరాం



# పుస్తకసమీక్ష

## " నాలోని నాదాలు "

రచయిత్రి : చిల్లర భవానీదేవి, ఎం. ఏ.,
వెల : రు. 6-00
ప్రతులకు : యస్/బి-218, సచివాలయనగర్
వనస్థలిపురం, హైదరాబాద్ 500 661

ఈ రచయిత్రి ప్రస్తావనలో చెప్పినట్లు " అనుభూతికి లోనయి స్పందనతో అందించే "ప్రతి అక్షరం" కవితగా భాసిల్లుతుంది. భావావేశం - సానుభూతి - సౌత్రై - తనదై - తన స్పందనలను - నాదాలుగా మ్రోగించి అక్షర రూపంలో మనముందుంచారు. దానికితోడు " సామాజికస్పృహకు " కొరవలేదు. ఇందులో 61 కవితలున్నాయ్ - జీవితాన్ని తీక్షణంగా పరిశీలించే విశ్లేషణ వుండబట్టే - జీవితంలోని విభిన్న కోణాలనుంచి - లలిత - లలితంగానే నాదాలందించారు. చెప్పే విషయంలో స్పష్టత - సరళత - స్వచ్ఛత - సరైన అవగాహన ఉండబట్టే తన 6 వ కవితలో ! - "కాలపు జల్లెడలో/ పైన నిలిచేది కవిత " - అంటూ కవిత విలువను కాలమే - పాఠకులే నిర్ణయిస్తారని అంతర్నాదాలుగా అక్షరాలను మలచడం - ఆమె ఆలోచనా సరళకి అద్భుతమైంది. మొత్తం కవితలన్నిటిలోనూ ఆధునికత, అభ్యుదయ రాగాలతో నాదాలను అత్యద్భుతంగా అందివ్వడం ఆమె భావావేశానికే - అభినందనీయం. ఈ సమాజంలోని లోపాలను, బలహీనతలను ప్రమాదాలను ప్రభుత్వ వ్యవస్థలో నిరంకుశతను, అందంగానూ - కవితాత్మకంగానూ ధ్వనిపూర్వకంగా రమణీయంగా చిత్రిస్తారు. ఈమె కవితిలోక రసతరంగిణిల్లో పొంగిన మధుర భావ ఝరి. ఎందుకింత పొగడ్తల హోరులంటే - ఉదాహరణకు - 42 కవిత " బాగుంది " (శీర్షిక) అనే దాంట్లో - " పగడాల పంజరంలో పవిత్రభూమి/ పగలతో/ సెగలతో/ రగిలిపోతూవుంటే దేశం చాలా బాగుంది-/ దేశప్రగతి — ఓహ్ — అది మరీ బాగుంది ? " - అనే మాటలు మన ప్రస్తుత దేశపరిస్థితుల కనుగుణంగా - అసలైన వ్యంగ్యంతో - హేళన చేసిన తీరు ఎవ్వరికైనా అర్థమవుతుందికదా ! - అలాగే మొదటి కవిత " వసంత వనం " మన దేశంకి ముల్లొకటి ప్రవేశించింది - పుష్పాలనే కుచ్చి - నొప్పి పుట్టించి దారుణంగా కేకలేయించిందనడంలో స్వార్థాన్ని - నిర్దయలు దేశంలో చోటు చేసుకున్నాయనే ధ్వనిని స్ఫురింపచేస్తారు -

సాహితీ వీధిలో సమరం చేస్తూ-అక్షరాల ప్రయోగాలు ప్రయోజనాలను వివరిస్తూ - " 14 వ కవిత " జీవితం " కరిగిపోయేలోగా కాంతు లందించాలనే సందేశాన్నంది ...ప - ఆశావాది కాబట్టే " రేపటి ఉషస్సు " కోరుకుంటూ - " మరో సూర్యునికి మేలుకొలుపు పాట పాడగలనని - ఈ వ్యవస్థను మరమ్మత్తు చేయాలి అనడం కవితకే ఓ హైలెట్ - 21 వ కవితలో "జీవితసత్యం"లో జీవితం క్షణకాలంకాబట్టే-శీతాంశునిలా కాంతులు పంచు" అంటూ మానవతను చాటి చెప్తారు-అదే సత్యం అంటారు. 26 వ కవిత " ఒక్కటే " గూర్చి రాయకుండా వుండడం ధర్మం కాదు - ఈ పుస్తకానికే కలికితురాయి ఐన ఆ కవితలో కవయిత్రి హృదయకేదారంలో నుండి రస తరంగిణిలా పొంగిన మధుర భావ ఝరి - ఆధునిక సమస్యలపై వక్రోక్తిని - చమత్కృతిని కావ్యాత్మకంగా ఆలోచన చేసుకొని - వ్రాసింది.

మనల్ని మళ్ళీ - మళ్ళీ చదివించేట్టు చేస్తుంది కవిత " అందరం సహోదరులం " ఎంత సమైక్యత ప్రతీకగా గీతాలాపన ! - 39వ " వేణువు " ఊది మధురంగా వినిపించాలని మనిషి - మనసు చంపుకొని "వికృతపు జాడల్లో నడుస్తూన్న ఓ మనిషి"/ అని అనే వ్యంగ్యం మరుపురానిది - అందుకే 47 కవిత చైతన్యంలో స్పందించమంటారు - మనిషికి ప్రాణాధారం ఆలోచన - అది కావాలని యిది చదివి ఆలోచించి-స్పందించమంటారు మనల్ని.

— వేమూరి రాధాకృష్ణమూర్తి

